# గృహలక్ష్మి

స్త్రీల సచిత్ర మాసపత్రిక

# GRIHALAKSHMI

LADIES' TELUGU MONTHLY



'GRIHALAKSHMI' GRIHA

సంపాదకుడు

డాక్టరు కె. యన్. కేసరి

సంపుటము ౨౧] మే 1952 [సంచిక ౫




## సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్ధసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతి లేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

## ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

## వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకే ప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

## సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

## చిరునామా మార్పు

చిరునామాయందు మార్పు ఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

## ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

పక్షిరాజా వారి

# కాంచనా

తెలుగు

లలిత ...... పద్మిని
కె. ఆర్. రామస్వామి
దొరైరాజ్
ఋష్యేంద్రమణి
రామ శర్మ
కుమారి
దొరైస్వామి నటించినది..





మాటలు, పాటలు
తోలేటి
డైరెక్షన్
S. M. శ్రీరాములు నాయుడు

త్వరలో విడుదల

# విషయసూచిక





**ముఖచిత్రం : శ్రీమతి టి. సూర్యకుమారి (మద్రాసు అందాలరాణి)**

'స్వతంత్ర' వారి సౌజన్యంతో




జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణి!



# కేసరి విద్యాలయముల అభివృద్ధి



ఏప్రియలు నెల 16-వ తేదిన కేసరి విద్యాలయముల వార్షికోత్సవము సందర్భమున ఆ బాలగోపాలము చూపిన ఆనందోత్సాహములు కనులపండుగగానుండింది; విద్యాలయముల అభివృద్ధి పరంపరలను వ్యక్తంచేసినవి.

విద్యాలయముల స్థాపకులు డా. కె. యన్. కేసరిగారు లక్షలకొలది ధనమిచ్చి, విద్యాలయముల అభివృద్ధియెడల ఆసక్తి చూపుచు, యీనాడు ఓపికతో ఉత్సవంలో పాల్గొనడం వచ్చిన అశేష ప్రజానీకపు ఉత్సాహాతిశయములకు కారణములైనవి.

కేసరివిద్యాసంఘపు అధ్యక్షులు సర్. అల్లాడి కృష్ణస్వామిగారు, శ్రీ కేసరిగారి దాతృత్వమును ప్రశంసించుచు వారుచేయుదానములు గుప్తదానములనియు, ఒకచేతితో చేసేవి మరొకచేతికి తెలియనట్టివని చెప్పినది గమనించతగినది. అంటే వారి దాన ధర్మములు పేరు ప్రఖ్యాతుల నుద్దేశించనవిగాని, ఆడంబరమున నుద్దేశించినవి మాత్రము గాని కావని తెలియుచున్నది. ఇట్టి దాతలు చాల అరుదు. విశాల హృదయంతో ఉత్తమ లక్ష్యాల సాధన నుద్దేసించిన దానధర్మములు ప్రజాభ్యుదయానికి, మానవ శ్రేయస్సుకు ఎంతో ఉపకరించగలవనుట సత్యసమ్మతము.

మహోత్సవమునకు అధ్యక్షతవహించిన శ్రీ వి. వి. గిరిగారు దివాన్ బహదురు బండి శ్రీ హరిరావు నాయుడుగారి చిత్రపట అవిష్కరణ సందర్భమున ప్రభుత్వోద్యోగులకు నాయుడుగారు ఆదర్శప్రాయుడన్నారు శ్రీ వి. వి. గిరిగారు.

శ్రీ నాయుడుగారు కొద్దివేతనంతో ప్రభుత్వోద్యోగిగాచేరి తమ బాధ్యతలను సమర్థతతో నిర్వహించుచు అనేక ఉన్నతపదవుల నలంకరించారు. వారు ఉద్యోగ ధర్మంతో బాటు ప్రజాశ్రేయస్సును దృష్టిలోనుంచుకొని అచంచల దీక్షతో కృషి చేసినట్టివారు. అట్టి నాయుడుగారిని ఆదర్శంగా తీసికొని తమ ధర్మాలను, బాధ్యతలను నిర్వహించిన నాడు ప్రజలకు, ప్రభుత్వానికి మరింత సన్నిహిత సంబంధము లేర్పడుటయేకాక ప్రభుత్వోద్యోగులు ప్రజల ఆదరాభిమానములకు పాత్రులు కాగలరు.

శ్రీ కేసరిగారు విద్యాలయముల స్థాపనతోగాని, వాని ప్రస్తుత అభివృద్ధితోగాని తృప్తిపడటంలేదు. కేసరివిద్యాసంఘ కార్యదర్శి బండి శ్రీ హరిరావునాయుడుగారి కార్యదీక్ష, ఉత్సాహము, పలుకుబడి కేసరి ఉన్నత విద్యాలయము కళాశాల కావడానికి వినియోగపడాలని శ్రీ కేసరిగారి కోర్కె. ఆ కోర్కె శ్రీ హరిరావునాయుడుగారి వలన మాత్రము నెరవేరేదికాదు.

మద్రాసులో అనేక వందల సంవత్సరములనుండి తెలుగు కుటుంబాలు స్థావర మేర్పరచుకొని యున్నవి. దరిమలా వివిధవ్యాపారస్తులు, ఉద్యోగస్తులు, యింకా అనేక వృత్తులవలంబించ అనేకమంది మద్రాసులో స్థావరమేర్పరచుకొన్నారు ఈనాడు ఏవిధంగాచూచినా మద్రాసులో వారికి సర్వహక్కులుండికూడ మద్రాసు ఆంధ్రులు తమ బిడ్డలకు విద్యావసతులులేక యిబ్బందిపడుతున్నారు. ఇట్టి యిబ్బందిని తీర్చడానికి ముందంజవేసినవారు శ్రీ కేసరిగారు. వారి నాదర్శంగా నుంచుకొని శ్రీ మంతులు, నటులు, గాయకులు విరివిగా విరాళములనిచ్చి, సేకరించి కేసరికళాశాల నిర్మాణానికి, వివిధప్రాంత్యములలోని తెలుగు బాలబాలికలకు విద్యావసతులు లేర్పడునట్లు కృషి చేయగలరని మావిజ్ఞప్తి.

ప్రస్తుతపు మద్రాసు విద్యాశాఖమంత్రి శ్రీ యమ్ వి. కృష్ణారావుగారు యీ సందర్భంలో ప్రసంగించుచు తమపైనుంచిన గురుతరమైన బాధ్యతను శక్తివంచన లేకుండా న్యాయంగా నిర్వహిస్తామని చెప్పిన మాటలు హర్షింపతగినవి. వారు పదవిలో నుండగానే కేసరి కళాశాలస్థాపన జరుగటం సముచితం. ఇందుకు ఆంధ్రప్రజానీకం తమ సంపూర్ణ సహకారములను చూపగలదని మా విశ్వాసం.

సి. సి. పున్నయ్య

——(o)——



కేసరి విద్యాలయముల వార్షికోత్సవ సందర్భమున తీసిన ఛాయాచిత్రము, సర్ అల్లాడి కృష్ణస్వామిగారు,
డా. కె. యన్. కేసరిగారు, వి. వి. గిరిగారు, డా. యమ్. వి. కృష్ణారావుగారు (మద్రాసు
విద్యాశాఖ మంత్రి), కేసరి విద్యాసంఘ సభ్యులు యిందుకలరు.




## శనిబాధ తప్పించుకొనే విధం

శనిగాని కత్తికి ఎదురులేకుండా పోయింది. అన్నిలోకాల్లోని వారికి అతనంటే హడలు అయింది. గర్వం కండ్లను కప్పేసింది మహాపొగరుతో పోతూన్నాడు. శనిగాడు. ఎదురుగా వస్తున్న నారదుణ్ణి చూచి నమస్కారం అని కృతజ్ఞత తెల్పడానికి బదులుగా మొఖం గిర్రున త్రిప్పుకున్నాడు మహాప్రక్కకు. యీసంగతి ఆ దేవముని గమనించకుండా వుంటాడా?

"ఒరే శనిగా" అన్నాడు నారదుడు.

ఇష్టం లేకపోయినా వెనక్కు తిరిగిచూచి "ఓహో నారదమహర్షిగారా!" అన్నాడు శనిగాడు.

"నారదగా అనేది మానేసి క్రొత్తలోకను తగిలిస్తావేంరా? ఈమధ్య బోర్డు మారింది కామోసు' "నాదిగ్విజయ యాత్రలో మహాత్మ బిరుదు ఫిలింకంపెనివారు యిచ్చారన్న సంగతి తమకింకా న్యూసు రాలేదనుకుంటా - సినిమా పేపర్లంతా అదివరకే ప్రకటించేసాయి ఈ విషయం."

"నీవు మహాత్మా శనిగారైనావా? భేష్ తమ దయవల్లే కావాలి క్రొత్తగా ఇప్పుడు రిలీజైన ఫిలిం డబ్బాలన్నీ తొందర తొందరగా యింటి వైపుకు దారితీస్తున్నాయ్. ఇదంతా తమ పుణ్యంఏనా?"

శనిగాడు ఉబ్బి తబ్బిబై పోయ్యాడు."

నారదుడు కండ్లెర్ర చేస్తూ "ఒరేనిన్నెవ్వర్రా మహాత్మా అనిపిల్చేది. తిన్నింటికే వాసాలు లెక్కబెట్టేరకం. ఫిలింకంపెనివారు మహాత్మా శనిమహారాజ్ అన్నా! నేనుమాత్రం ప్రాణం వున్నవరకు అలా అనలేను - 'ఒకవేళ నీవు శివుణ్ణి గెల్చిన సర్టిఫికెట్టు తెచ్చినప్పుడు తప్ప!"

"అదెంతోయ్ మనకు" అని శని కైలాసానికి దారితీసాడు. నారదుడెక్కడికో ... ... ?

♦ ♦ ♦

పరమ శివుడు పార్వతికోసం పరమానందంగా నాట్యం చేస్తూవున్నాడు. ప్రమథుల గృహాంతరానికి బైట బాజా భజాయించుతూ వున్నారు. ప్రతిహారి జనానాలోకి వచ్చి శివునికి, శనిరాకను తెలియ పరుస్తుంది. ఎక్కడి సందడి అక్కడే మాయం అయిపోయింది, శనిగానిరాకవల్ల! అందరు హడలి పోయ్యారనే చెప్పొచ్చు. శివుడు గొంతు సవరించుకొంటూ "రమ్మను" అన్నాడు. శనివచ్చి "నమస్కారం" అంటాడు.

"ఇప్పుడొచ్చావేం? నిన్న ఉదయం రమ్మంటినిగా!" అన్నాడు శివుడు.

"నిన్ననే నేను రాబట్టే పరమ శివుడంతటి వాడు నాదెబ్బకు భయపడి గృహంలో దాక్కొని రాళ్లను దారికి అడ్డంగా బిగించుకొని ఝాంసేపు బైటకు రాకుండా వున్నాడు, ఓడినట్టు సర్టిఫికెట్టు ఇప్పిస్తే నారదుడికి చూపించి మహాత్మా శని అనిపించుకొంటూ" అన్నాడు శని.

పార్వతివద్ద పరువు పోవడంవల్ల తెల్లబోయిన ముఖంతో శివుడు "నీవు నా ప్రతిబింబం అగు ఆంజనేయుణ్ణి కూడా నీవు గెల్చిరాగానే రాసిస్తా" నన్నాడు.

శని హిమవత్పర్వతంలో తపస్సు చేసుకుంటూవున్న హనుమంతుని వద్దకు వెళ్లుతాడు. మరల కైలాసంలో కార్యక్రమం ఆరంభింప బడుతుంది.

♦ ♦ ♦

అంజనేయుని వద్దకు శనిగాడు చేరాడు. "నీవద్దకు వచ్చాను. కాచుకో నా ప్రతాపం' అన్నాడు శని.

"నేను బ్రహ్మచారిని, శనిగా - నీకు యిక్కడ కూర్చోడానికి కుర్చీ, తినడానికి అన్నం ఎలాదొరుకుతుంది? సంసారులిండ్లకు పో? అన్నాడు అతను;

"నిన్ను గెలిస్తేనేగాని మహాత్మా శని అనే బిరుదు రాదు నాకు - నీవు ఓడినట్లు ఒప్పుకో' అన్నాడు శని.

వీడిమాటలకు మండిపొయ్యాడు ఆకోతి "ఎక్కడ కూర్చొంటావూ?" అన్నాడు.

"నీభుజం మీద" అన్నాడు, వేళాకోళంగా శని.

"రా! కూచో" అన్నాడు - అతను.

శనిభుజం ఎక్కాడు. ఆంజనేయుడు పెద్దపర్వతాన్ని ఎత్తి శనిమీద వుంచాడు. క్రిందభుజం పైన పర్వతం ఈ రెంటి మధ్య శని నలిగిపోసాగాడు. గర్వంపోయింది శనికి. ప్రాణమోసంలో పడ్డాడు. వదలిపెట్టమని ప్రాధేయ పడ్డాడు. కోతులరాయుడు, నారదుడు, "శనీ! నీవుచస్తే లోకానికి ఎంతో మేలు చేసిన వాణ్ణి అవుతా నలిగిపోయి శనిగా చావరా?" అంటాడు.

శనికో వుపాయం తోచింది. చాలాసేపు బాధపడినాడు అది - ఇది - "నేను చస్తే నరులు రాముణ్ణి తలంచరు. నేను పీడిస్తేనే నీరాముణ్ణి నిన్ను తల్చడం. నేను చచ్చాక నీపేరుండదు. అది ఆలోచించుకో!" అంటూ మేకపోతు గాంభీర్యం చూపాడు శని. మందుపారింది. నిజం అనుకొని రాముడికోసం శనిగాణ్ణి వదిలేస్తాడు - ఆంజనేయుడు. పర్వతం తియ్యగానే శనిగాడు పరిగెత్తిపారిపోసాగాడు. థాంక్సు అని చెప్పకుండా పోతున్నందుకు కోపం వచ్చి అతను వాలాన్ని పంపినాడు. వాలం శరవేగంతో పోయి శనిగాణ్ణి పట్టితీసుకొచ్చింది బంధించి - శని గజగజ లాడిపోతున్నాడు. ఈసంకటం తప్పించుకోవడం ఎలాగా అనేది తోచక.

"ఒరే శనీ! నా పేరు స్మరించగానే నీవువారిని వదలి పెట్టానను! వదుల్తా?" అన్నాడు అంజనేయుడు.

శని తలవూపినాడు. వాలం సళ్లింది. విముక్తి కలుగంగానే "అయితే నావరమగు శనివారం నాడే పూజలు చేయించుకోవలెను." అన్న షరతులు పెట్టినాడు. ఆంజనేయుడు సరేనన్నాడట. ఆనాటినుంచి ఆంజనేయ పూజకు అన్నివారాలకంటే శనివారం ముఖ్యంగా ఎంచబడింది. ఎలాంటి శనిపీడ అయినా ఆంజనేయునిస్తోత్ర, పూజా, సేవ, జప, అర్చన, అష్టోత్తర, సహస్రనామ స్తవ, మంత్ర తావీజులవల్ల పోవడం వాడుక అయింది లోకంలో.

మిసెస్. ఆంజి

# పిసినిగొట్టు

వే. దమయంతి

పగలంతా వాగిననోరు సంధ్యచీకట్లలో సన్నగిల్లింది. ముగ్గురు పెద్దడాక్టర్లు ఒకళ్లకు తెలియకుండా ఒకరు వచ్చి చూశారు. మూర్తిగారిని పరీక్ష చేశారు. ఉలకడు పలకడు. కొద్దిగంటల క్రితం యిల్లు దద్దరిల్లేటట్టు అరిచిన మూర్తిలో యింత ఊహింపలేనిమార్పు తక్కువకాలంలో ఎలావచ్చిందా అని అందరికీ సందేహమే గల్గింది. అంతే కాదు ఆయన 43 సంవత్సరముల జీవితంలో కూడా ఎప్పుడూ ఒకర్ని తన శరీరము యొక్క ఆరోగ్యం నిమిత్తం పీసమెత్తు పని ఎవరిచేత చేయించుకోలేదు. ఆ అవసరం కూడా ఎప్పుడూ కలగలేదు. ఒకసారి మాత్రం వానలో తడిసినప్పుడు కొద్దిగా ఒళ్లు భారకించింది. యింట్లో తన దగ్గరవున్న మందులతోటే పెళ్లానిక్కూడా తెలియకుండా సరిచేసుకున్నాడు. అందువల్లే ఆయనకు ఏడాక్టరుతోటి ఎక్కువ పరిచయం కలగలేదు.

ఊళ్లో మూర్తిగారంత పెద్ద మోతుబరుకి ఏడాక్టరుతోటీ స్నేహం లేకపోవడం, ఏ ఆఫీసరుతోటి పరిచయం లేకపోవడం వూళ్లో వాళ్లందరికి ఒక విధమైన ఈర్ష్యగా వుంటూ వుండేది. ఊళ్లో పెద్ద ఆఫీసర్లకి మూర్తిగారి తత్వం అర్థం కాక వింతగా చూస్తూండేవారు. అంతేకాదు. కొంత మందిమూర్తిగారికి చాలా పొగరని ఎప్పుడో తగినశాస్తి చెయ్యాలని అనుకుంటూ వుండేవారు. కాని అందరు ఆయన వెనక నిలబడి ప్రగల్భాలు చెప్పేవారేగాని ఆయన ఎదుటకువచ్చి ఒక్కసారన్నా నోరు మెదపలేక పోయేవారు.

ఎమిటో మూర్తిగారంటే అందరికీ భయంగానే వుండేది. ఆయన కోరమీసాలు చూసేటప్పటికి కొత్తగా యింటికి వచ్చిన చంటిపిల్లలు సయితం గుక్కపట్టి ఏడ్చేవారు. మూర్తిగారికి ఊళ్లోవాళ్లతో అంతపరిచయం కాకపోయినా ఊళ్లోవాళ్లందరికీ కూడా మూర్తిగారు తెలుసు. అదే ఆయనలోని విశిష్టత.

ముగ్గురు డాక్టర్లు నిదానంగా పరీక్షించారు గాని అసలు జబ్బు ఏమిటో మాత్రం కనిపెట్టలేక పోయారు. నాడి బాగానే వుందన్నారు అందరు కూడా. జబ్బుమాత్రం ఫలానా అని నిర్ధారణ చెయ్యలేక పోయారు. ముగ్గురు డాక్టర్లు మూడు రంగుల మందులు యిచ్చారు.

రాత్రి 10 గంటలు కూడా అయిపోయింది. అప్పుడే స్పృహతప్పి 4 గంటలు దాటింది. బామ్మగారు (మూర్తిగారి తల్లి) వంటయింట్లో కూర్చుని ఎవరూ చూడకుండా ఏడుస్తున్నారు తనకి కొడుక్కు సంబంధం వదిలిపోతుందని యింక మూర్తి బ్రతకడని

పార్వతివద్ద పరువు పోవడంవల్ల తెల్లబోయిన ముఖంతో శివుడు "నీవు నా ప్రతిబింబం అగు ఆంజనేయుణ్ణి కూడా నీవు గెల్చిరాగానే రాసిస్తా" నన్నాడు.

శని హిమవత్పర్వతంలో తపస్సు చేసుకుంటూవున్న హనుమంతుని వద్దకు వెళ్లుతాడు. మరల కైలాసంలో కార్యక్రమం ఆరంభింప బడుతుంది.

  

అంజనేయుని వద్దకు శనిగాడు చేరాడు. "నీవద్దకు వచ్చాను. కాచుకో నాప్రతాపం' అన్నాడు శని.

"నేను బ్రహ్మచారిని, శనిగా - నీకు యిక్కడ కూర్చోడానికి కుర్చీ, తినడానికి అన్నం ఎలాదొరుకుతుంది? సంసారులిండ్లకు పో? అన్నాడు అతను;

"నిన్ను గెలిస్తేనేగాని మహాత్మా శని అనే బిరుదు రాదు నాకు - నీవు ఓడినట్లు ఒప్పుకో' అన్నాడు శని.

వీడిమాటలకు మండిపోయ్యాడు ఆకోతి "ఎక్కడ కూర్చొంటావూ?" అన్నాడు.

"నీభుజం మీద" అన్నాడు. వేళాకోళంగా శని.

"రా! కూచో" అన్నాడు - అతను.

శనిభుజం ఎక్కాడు. ఆంజనేయుడు పెద్దపర్వతాన్ని ఎత్తి శనిమీద వుంచాడు. క్రిందభుజం పైన పర్వతం ఈరెంటి మధ్య శని నల్గిపోసాగాడు. గర్వంపోయింది శనికి. ప్రాణమోహంలో పడ్డాడు. వదలిపెట్టమని ప్రాధేయ పడ్డాడు. కోతులరాయుడు, నారదుడు, "శనీ! నీవుచస్తే లోకానికి ఎంతో మేలు చేసిన వాణ్ణి అవుతా నల్గిపోయి శనిగా చావరా?" అంటాడు.

శనికో వుపాయం తోచింది. చాలాసేపు బాధపడినాడు అది - ఇది. "నేను చస్తే నరులు రాముణ్ణి తలంచరు, నేను పీడిస్తేనే నీరాముణ్ణి నిన్ను తల్చెడం. నేను చచ్చాక నీపేరుండదు. అది ఆలోచించుకో!" అంటూ మేకపోతు గాంభీర్యం చూపాడు శని. మందుపారింది. నిజం అనుకొని రాముడికోసం శనిగాణ్ణి వదిలేస్తాడు - ఆంజనేయుడు. పర్వతం తియ్యగానే శనిగాడు పరిగెత్తిపారిపో సాగాడు. థాంక్స్ అని చెప్పకుండా పోతున్నందుకు కోపం వచ్చి అతను వాలాన్ని పంపినాడు. వాలం శరవేగంతోపోయి శనిగాణ్ణి పట్టితీసుకొచ్చింది బంధించి - శని గజగజ లాడిపోతున్నాడు. ఈసంకటం తప్పించుకోవడం ఎలాగా అనేది తోచక.

"ఒరేశనీ! నాపేరు స్మరించగానే నీవువారిని వదలి పెట్టానను! వదుల్తా?" అన్నాడు అంజనేయుడు.

శని తలవూపినాడు. వాలం సళ్లింది. విముక్తి కలుగంగానే "అయితే నావరమగు శనివారం నాడే పూజలు చేయించుకోవలెను." అన్న షరతులు పెట్టినాడు. అంజనేయుడు సరేనన్నాడట. ఆనాటినుంచి ఆంజనేయ పూజకు అన్నివారాలకంటే శనివారం ముఖ్యంగా ఎంచబడింది. ఎలాంటి శనిపీడ అయినా ఆంజనేయునిస్తోత్ర, పూజా, సేవ, జప, అర్చన, అష్టోత్తర, సహస్రనామ స్తవ, మంత్ర తావీజులవల్ల పోవడం వాడుక అయింది లోకంలో.

మిసెస్. ఆంజి

కూడా అనుకొని వెక్కి వెక్కి ఏడుస్తున్నారు. రెండుసార్లు మూర్తి దగ్గరకొచ్చి ఒళ్లంతా వూపి పలకరించిరింది. కనీసం నోటంట 'ఊ' అన్న మూల్గన్నా వినబడటంలేదు. వెర్రిగా మాత్రం చూశాడు ఒక్కసారి - అంతే. మళ్లా కళ్లు మూసుకున్నాడు.

రాత్రి 11 గంటలుదాటింది. పక్క ఇంటి శ్రీనివాసరావుగారు పొలంనుంచి కుప్పకి అబ్బాయిని కాపలా వుంచి భోజనం చెయ్యడాన్కి యింటికివచ్చి మూర్తిగారు స్పృహతప్పి వున్నాడని భార్యద్వారా విని కాళ్లు కూడా కడుక్కోకుండా మూర్తిగారింటకి వచ్చాడు. మూర్తిగారిభార్య, తల్లి, కూతురు మూర్తిగారి మంచం దగ్గర విచారంగా కూర్చున్నారు. శ్రీనివాసరావుని చూసేటప్పటికి బామ్మగారి దుఃఖం గట్లు తెగింది. చీనయ్యా (శ్రీనివాసరావుని చీనయ్యా అంటారులెండి) చేతులు పట్టుకు ఏడ్చింది.

'అసలు ఏంజరిగింది. మధ్యాహ్నం మూడు గంటలకి పొలం వెళ్తున్నప్పుడు వసారాలో నిలబడి నవ్వాడు కూడా. అప్పటికి బాగానే వున్నాడు మరి. ఎప్పటి నుంచి యిలాగ' అని అడిగాడు చీను.

'ఎవరో చేతపడి చేసివుంటారు నాయనా' మధ్యాహ్నం కాఫీత్రాగాడు; తర్వాత వీధిలోకి వెళ్లి కారాకిళ్లీ వేసుకుని మామూలుగా వచ్చాడు. తరువాత ఒక అరగంట ఏవో కాగితములు చూసుకున్నాడు - అంతే మళ్లా లేవలేదు.'



'కొంపతీసి కిళ్లీలో విషం కలపలేదు కదా' అన్నాడు చీనయ్యా చటుక్కున. 'బామ్మగారు ఏమో అదే అయివుంటుంది- యింతహఠాత్తుగా యిలాగ ఎలాగ అవుతాడు, ఏమీలేకపోతే!' అంది.

చీనయ్యకి కూడా బలమైన నమ్మకం కుదిరింది వెంటనే కిళ్లీ రాములు యింటికి వెళ్లి రాముల్ని నిజం చెప్పమని అడిగాడు. రాములు కంగారు పడిపోయాడు. అతని శరీరం అంతా ఒణికిపోయింది. తానేమిటి విషం కలపడమేమిటి. అతనికళ్లు తిరిగి పోయాయి. చీనయ్యా చేతులు పట్టుకొని ఏడ్చాడు తనకేమి తెలియదని. మామూలుగానే కిళ్లీకట్టిచ్చానని చెప్పాడు.

చీనయ్యకి కూడా రాములు మొహంచూస్తే నిర్దోషని అనిపిస్తునేవుంది. మరి మూర్తిగారికి యింత జబ్బు చెయ్యడానికి కారణం మాత్రం అర్థమవలేదు. రాములు వెంటనే చీనయ్యతోటి మూర్తిగారింటికి వచ్చాడు.

రాములు మూర్తిగారింట్లో కాలు పెట్టాడో లేదో బామ్మగారు 'దొంగ వచ్చావురా! ఏం మందు పెట్టావురా' అంటూ నోటికి తిరగనితిట్లతో స్వాగతం యిచ్చింది. రాములు మాత్రం చాలా శాంతగా తాను నిర్దోషిని అని చెప్పుకున్నాడు. బామ్మగారికి మాత్రం నమ్మకం కుదరలేదు.

'అమ్మా నాకిల్లీషాపునుంచి వచ్చిన తర్వాత ఎంతసేపటికి యిలా పడిపోయారు' అన్నాడు రాములు.'ఒకగంటకి'

'ఈగంటలోను ఎవరన్నా వచ్చారా!'

'పోష్టువాడు తప్ప ఎవరూ రాలేదు'

రాములు బుర్రలో ఏదో ఆలోచన మెరసింది. 'ఎవరిదగ్గరనుంచి వచ్చాయమ్మా వుత్తరములు' అని అడిగాడు.

'ఏమో తెలియదురా' అంది బామ్మ.

'పోనీ ఆవుత్తరములు ఎక్కడవున్నాయో చూపిస్తారా అమ్మా' అన్నాడు రాములు.

రాములు కిల్లీ షాపువాడైనా చాలా తెలివైనవాడు, పెద్దమనిషి. స్కూల్లో స్కూలు ఫైనలువరకు చదువుకున్నాడు. Investigation అంటే చాలా సరదా. ఎప్పుడయితే ఉత్తరములు అన్నారో అప్పుడేరాములు అనుకున్నాడు ఏదో హఠాత్తుగావచ్చిన వార్త వల్ల గల్గిన Shock అయివుంటుందని.

బామ్మగారు మంచం చుట్టు వెతికి శాల్వా కిందపడివున్న తంతి బయటకుదీశారు. రాములు Telegramతీసి చదివాడు. "Regret Ship sunk. Lost hundred bags" అని వుంది.

రాములుకు అంతా అర్థమయింది. చీనయ్యకి కూడా చూపించాడు. మూర్తిగారి లోభత్వానికి, పిసినిగొట్టుతనానికి తగిన శాస్తి జరిగిందని లోలోపల సంతోషించారు. కాని ప్రస్తుతం అతనిజబ్బు బాగు చేయడానికి మార్గం ఆలోచించాలి.

రాములకు చక్కటి ఆలోచన తట్టింది. వెంటనే టెలిగ్రాఫ్ ఆఫీస్ కి వెళ్లాడు. అక్కడ రాములకి తెలుసున్న వాళ్లతో మాట్లాడాడు. ఒకదొంగ టెలిగ్రాం బంట్రోతుకి యిచ్చి మూర్తిగారి యింట్లోయిమ్మన్నాడు.

రాములు చీనయ్య యిద్దరు మూర్తిగారి యింటికి వచ్చి కూర్చున్నారు. మూర్తిగారు వెర్రిగా చూస్తున్నాడు. యింతలోనే టెలిగ్రాం బంట్రోతువచ్చి టెలిగ్రాం యిచ్చాడు.

మూర్తిలో ఏన్నో Feelings వస్తున్నాయి. రాములు మూర్తికళ్ల ముందే కవరు చించాడు. 'Ship reached harbour safe. No loss, your bags safe' అని గట్టిగా చదివాడు. అంత జబ్బుగానున్న మూర్తి 'ఆ' అంటూ ఆశ్చర్యంగా మోచేతుల మీద గభాలున లేచాడు.చీనయ్య రాములు తమపాచిక పారినందుకు ఒకరి నొకరు చూచి నవ్వుకున్నారు.

బామ్మగారు కొడుకుని ఒక్కసారి ఆనందముతో కౌగలించుకుంది.

---

# కేసరి విద్యాసంఘపు వార్షిక నివేదిక.

## 1951—52

కేసరి విద్యాసంఘ పాలకవర్గము తరఫున సంఘపు కార్యకలాపములను గురించి నేను సంతోషపూర్వకముగా నీవార్షిక నివేదికను సమర్పిస్తున్నాను.

ది 19-4-1951 న కేసరి విద్యాలయముల వార్షికోత్సవము త్యాగరాయనగర మందలి కేసరిప్రాథమిక పాఠశాల భవనమునందు, ప్రాథమిక పాఠశాలభవన ప్రారంభోత్సవముతోబాటు వైభవముగాజరిగెను. మా రెండు విద్యాలయములందలి బాలబాలికల తలిదండ్రులు యీ ఉత్సవములలో పాల్గొనుట కవకాశముండునట్లుగా ఒక సంవత్సరము ఒక విద్యాలయములోను, మరొక సంవత్సరము మరొక విద్యాలయములోను యీ వార్షికోత్సవము జరుపుటకు ఏర్పాటుచేయబడినది.

క్రిందటి వార్షిక నివేదికలో తెలిపినట్లు యీ కేసరి విద్యాసంఘము మైలాపూరునందలి కేసరి ఉన్నత విద్యాలయమును, కేసరి ప్రాథమిక పాఠశాలను (త్యాగరాయనగరు) నిర్వహించుచున్నది.

కేసరి హైస్కూలు, మైలాపూరు:— (A) ప్రస్తుతపు విద్యార్థుల సంఖ్య 556 ; అందులో 184 మంది బాలికలు. పాలకవర్గము ప్రాథమిక తరగతులను ప్రత్యేక విద్యాలయముగా నేర్పాటుచేసి అందువలన ఏర్పడగల ఆర్థిక సదుపాయములను పొంద ప్రయత్నించుచున్నది కాని ప్రాథమిక పాఠశాల కనువైన స్థలము లభించుట కష్టసాధ్యముగానున్నది.

(B) సిబ్బంది : ప్రధానోపాధ్యాయులు శ్రీ కె. వెంకటరాజుగారు కాక అయిదుగురు యల్. టి. ఉపాధ్యాయులు, అందులో ఒక స్త్రీ, ఒకరు ట్రెయినింగు కాని పట్టభద్రుడు, ఏడుగురు సెకండెరీ ట్రెయినింగు అయినవారు, ఒక డ్రాయింగు ఉపాధ్యాయుడు, వ్యాయామక్రీడల అధ్యాపకురాలు, యోగ్యతపొందిన వృత్తివిద్యా టీచరు, ఇద్దరు తెలుగుపండితులు, ఇద్దరు సంస్కృత పండితులు, ఒక హిందీపండితుడు, యోగ్యత పొందని వ్యాయామ క్రీడల అధ్యాపకుడు పనిచేయుచున్నారు.

(C) విద్యాబోధన : విద్యాబోధన యస్. యస్. యల్. సి. ప్రణాళిక ననుసరించి జరుగుచున్నది; Composite లెక్కలుతప్ప మిగిలిన పాఠములు అన్ని తరగతులకు తెలుగులోనే చెప్పబడుచున్నవి. 5, 6 ఫారములలో తెలుగుగాని, సంస్కృతముగాని అభ్యసించుటకు అవకాశములు ఏర్పాటు చేయబడినవి. రెండవభాగముక్రింద 1 మొదలు 4-వ ఫారమువరకు సంస్కృతమును ప్రథమభాషగా 1950 'విద్యాభ్యాస'

ప్రణాళిక ననుసరించి బోధించబడుచున్నది. హిందీ మూడవభాషగా 1 మొదలు 3-వ ఫారమువరకును, 4-వ ఫారమునకు వృత్తివిద్యకు బదులుగాను, నూలువడుకుట బేసిక్ వృత్తి విద్యగా నేర్పబడుచున్నవి. విద్యాలయములోనవారు మగ్గము, Tablet baby loom అమర్చబడియున్నవి.

(D) యస్. యస్. యల్. సి. పరీక్షలు : 54 గురు విద్యార్థులు పరీక్షకు 1951 మార్చిలో పంపబడిరి ; అందులో 37 గురు ఉత్తీర్ణులయిరి. అనగా 69% ఫలితములు ; 1950 లో 52% ఫలితములుగానుండెను. ఈ సంవత్సరము 42 మంది పరీక్షకు పంపబడిరి ; అందు 6 గురు బాలికలు.

(E) తనిఖీ : తమ వార్షిక తనిఖీ రిపోర్టులో, విద్యాలయపు సర్వతోముఖాభివృద్ధియడల తమ సంతృప్తిని జిల్లా విద్యాశాఖాధికారి, ప్రాంతీయవ్యాయామ విద్యాధికారి వెల్లడించిరి.

(F) గ్రంథాలయము : విద్యాలయములోని పఠనాలయమునకు దిన, వార, మాసపత్రికలు, వస్తున్నవి. పది సంపుటముల ఆర్థర్ మీ వ్రాసిన Children's Encyclopedia ఈ మధ్యనే చేర్చబడినవి.

(G) విద్యావిషయములు : ఉపన్యాస, వ్యాసరచనపోటీలు ప్రతి తరగతిలో ఏర్పాటుచేసి బహుమతులీయబడుచున్నవి.

(H) ఆల్ ఇండియా రేడియో ప్రసారం : బృందగాన కార్యక్రమంలో 6 సార్లు మా విద్యాలయ విద్యార్థులు పాల్గొనిరి.

(I) విలాస ప్రయాణములు : అప్పుడప్పుడు యీ ప్రయాణములు ఏర్పాటు చేయబడుతున్నవి. ఉపాధ్యాయుల నాయకత్వముక్రింద విద్యార్థులందరు 4-వ మద్రాసు విద్యాప్రదర్శనమును గిండీకి వెళ్లిచూచిరి.

దృశ్యవిద్య : విద్యాలయము Bell & Howell Gaumont 16 M. M. సినిమా యంత్రము రు 1330-5-0 వ్యయముతో సమకూర్చబడినది. ప్రధానోపాధ్యాయుడు శ్రీ కే. వెంకటరాజు అన్నివిధముల ఉత్సాహవంతమైన కార్యక్రమమును నడుపుచున్నారు.

(K) కేసరి విద్యాసంఘ సహాయార్థం సెక్రెటేరియట్ ఆంధ్రసంఘమువారు మద్రాసు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తుల అధ్యక్షతన నాటకము ప్రదర్శించిన సందర్భమున షుమారు 10000-లు నికరాదాయము సమకూరెను. ఉదారహృదయముతో విరాళము లిచ్చినవారికి యీసంఘ పాలకవర్గము కృతజ్ఞత తెలుపుచున్నది.

త్యాగరాయ నగరునందలి కేసరి ప్రాథమికపాఠశాల క్రిందటి సంవత్సరము హైయర్ ఎలిమెంటరీస్కూలుగా మార్చబడింది. ప్రత్యేకముగా ప్రాథమిక పాఠశాలనుంచి, ఒకటి రెండు ఫారములతో మిడిల్ స్కూలు ఈ సంవత్సరము జూన్ నుండి నడుపుటకు ప్రయత్నములు జరుపుచున్నారు. క్రిందటి సంవత్సరముకంటె యీ సంవత్సరము పాఠశాల విద్యార్థులసంఖ్య 93 నుండి 136 కు పెరిగినది. అందు 65 మంది బాలికలు, 13 గురు హరిజనులున్నారు. రాజమండ్రి మిడిలుస్కూలులో 25 సంవత్సరములు అనుభవముగల ప్రధానోపాధ్యాయుడు, యిద్దరు సెకెండరీ గ్రేడు ఉపాధ్యాయులు, కుట్టుపని, ఎంబ్రాయిడ్రీ అధ్యాపకురాలు పనిచేయుచున్నారు. 7 గురు ఉపాధ్యాయులలో 5 గురు స్త్రీలు. ఎగ్మూరు రేంజి డిప్యూటి యిన్స్పెక్ట్రెస్ 5-12-1951, ఆమె తర్వాతవచ్చిన ఆఫీసరు 27-2-1952 న హటాత్తు తనిఖీచేసి ప్రధానోపాధ్యాయుడు శ్రీ పి. రామారావుగారి కృషిని ప్రశంసించిరి. దసరా సందర్భములోని బాలానందం పోటీలలో మా పాఠశాలకు అధికసంఖ్యాకమైన బహుమానములు నృత్య, గాన, నాటికలకు మా విద్యార్థులు సంపాదించగలిగిరి. ప్రస్తుతము మా ప్రాథమిక పాఠశాల విద్యార్థులు ప్రదర్శించనున్న 'ప్రమీలార్జునీయ' నాటకం ప్రధానోపాధ్యాయుడు శ్రీ పి. రామారావుగారి ఉత్సాహ, శక్తి సామర్థ్యములను వ్యక్తముచేయగలవు. ఉచితంగా మా విద్యాలయమునకు వైద్యపరీక్ష చేయడానికి దయతో డాక్టరు మహంకాళి కృష్ణమూర్తిగారు అంగీకరించారు.

త్యాగరాయనగరు పాఠశాలకు ఒక స్థానిక సలహా సంఘమును శ్రీ సామి వెంకటాచలంచెట్టి, నేతి సుబ్రహ్మణ్యం, పి. గోవిందరాజ్ నాయుడు, ఆర్. యమ్. రాజగోపాల్ నాయుడు, పాఠశాల ప్రధానోపాధ్యాయులతో ఏర్పడినది. దానికి సమావేశకర్తగాను, అధ్యక్షుడుగాను, కరెస్పాండెంటుగారు వ్యవహరించెదరు. వివిధ ప్రాంతములందలి త్యాగరాయనగరు విద్యార్థులను సమీకరించుటకుగాను ఉదారులైన దాతల సహాయముతో ఒక మోటారువాన్‌ను కొనవలెనని పాలకవర్గమువారి కోరిక.

ప్రజలకు శ్రీ డా. కే యన్. కేసరిగారి ఉదారస్వభావమే ఈ విద్యాలయముల ప్రస్తుతస్థితికి కారణమని తెలుసును. రెండు సంవత్సరములనుండి అనారోగ్యముగా నున్నను, సావకాశ మున్నప్పుడెల్ల విద్యాలయాల అభివృద్ధికి శ్రీ కేసరిగారు తోడ్పడుచున్నారు. త్యాగరాయనగరు స్కూలులో ప్రతిశుక్రవారము సరస్వతిపూజ జరిపి ప్రధానోపాధ్యాయులు సున్నితమైన భాషలో భాగవతము, రామాయణం, భారతమును బాల



# రేడియో

## కళిదాస మహాకవి నాయికా చిత్రణ శాకుంతల

శ్రీమతి దేశిరాజు భారతీదేవిగారు

కావ్యములలో నాటకములు రమ్యములు. నాటకములలో శాకుంతలము రమ్యమని రసవేత్తలు నిర్ణయించిరి. ఈ నాటకమును సంస్కృతమున కాళిదాసమహాకవి రచించెను. అత్యుత్తమ నాటకమగుటచే నిది భారతదేశ భాషలలోనికేగాక ఖండాంతర దేశభాషలలోనికిగూడ ననువదింపబడి, ఖండాంతర సాహితీపరులచే కొనియాడబడినది. ఈ నాటకము చదివి స్వామి వివేకానందుడు శాకుంతలము తాజ్ మహాలంతటి మనోహరముగా నున్నదనెను. జర్మన్ పండితుడు "గోయథీ" "స్వర్గమర్త్య లోకముల నొకటిసేయు తీయునిముడి" యని వ్రాసెను. విశ్వకవి రవీంద్రుడు శాకుంతలము "శ్రుతిసుఖమైన కళ్యాణగానమ్మని" నుడివెను. భవభూతి వ్రాసిన యుత్తర రామాయణమునకట్టి ప్రశస్తి భారతదేశమునగలదుగాని ఖండాంతరములలో నున్నట్లు గానరాదు. సంస్కృత సాహిత్య మందగోరువారు పంచకావ్యపఠనమైన పిమ్మట శాకుంతలము చదువనిదే పండితులమనిపించుకొనలేరు. ఒక ధర్మముగాని, నీతినిగాని చిద్వృత్తుల హృదయసీమల నచ్చొత్తినట్లు హత్తించునట్టి దృశ్యకావ్యములలో నగ్రగణ్యమైన శాకుంతలములో పాత్రసృష్టి, పాత్రపోషణ యెట్లున్నదో విచారింతము. ప్రస్తుత వక్తవ్యాంశము నాయికా చిత్రణమేగావున నితర పాత్రల విడనాడి శకుంతలపాత్ర పోషణమును, రూపచిత్రణమును మహాకవి యెట్లు నిరూపించెనో చూతము.

శకుంతల జననమే స్వర్గమర్త్యలోకముల సంధి. తల్లి నాకలోక నివాసినియగు మేనక. తండ్రి మర్త్యలోకవాసియు, తపోనియమ బద్ధుండగు రాజర్షి. వీరికి బుట్టిన శకుంతల సురత్వ, మానవత్వ, రజోగుణ బీజములుగల ప్రకృతిదై యుండుట సహజము.

భరతఖండమున పూర్వము ఋషివాటికలు, అచ్చటి నియమసంస్కారణములు, మతినీతి ధర్మాచరణములు, తెలిసికొన్నచో నవి విశిష్టములైన పవిత్ర క్షేత్రములై, వైదిక ధర్మానుష్ఠాన విద్యాలయములై, స్త్రీ పురుషుల కాధ్యాత్మిక వికాస మొసంగునని విశదమగును. సత్త్వ గుణాభివృద్ధిగల్గజేయు సాధనా క్షేత్రమైన కణ్వాశ్రమమున శకుంతల, అతిథిపూజ, సాధుజంతుపోషణ, దయ, క్షమ మున్నగు సద్గుణములు నేర్చికొనెను, శకుంతలను యౌవనదశ పొటమరించెను. ఈ తరుణమునసే నాయికాపాత్ర ప్రవేశపెట్టబడినది.

శకుంతల సమవయస్కులగు ననసూయాప్రియంవదలతోగలసి లేతచెట్లకు నీరుపోయుచు, కుండలు చేగొని లతలయభివృద్ధిని పరికించుచుండెను. ఇట్టి సమయములో నాదృచ్ఛికముగా దుష్యంతు డాశ్రమమున ప్రవేశించెను. చూడగనే శకుంతల సహజ సౌందర్యమునకు వెఱగుపడెను. ఆశ్రమవాసులు ధరించు వల్కల ధారణముగూడ నామె సహజ తనూవిలాసమున కొకవిధమైన శోభను గల్గించెను. నాగరక స్త్రీలంగాంచిన దుష్యంతు డామెంగాంచి నిశ్చేరపడినాడు. "శుద్ధాంత దుర్లభమిదం వపు రాశ్రమ వాసినో"యని యగ్గించినాడు. పిమ్మట కొంత కొంత పరికించిచూచి "సరసిజమను విద్ధం

శైవలేనా పిరమ్యం మలినమపిహి మాంశోర్లక్ష్మ లక్ష్మీం తనోతి. ఇయమధిక మనోజ్ఞా వల్కలేనాపి తన్వీంకి మివహిమధురాణాం మండనం నాకృతీనాం" అని వచించినాడు. ఈ సందర్భమున నాయికా రూపచిత్రము మనకనేక భంగిమలలో గోచరించును. శుద్ధాంత దుర్లభమైన యపరూప సౌందర్యమును చిత్రించుట కనువైన ప్రకృతియు నాశ్రమ వాటికలో మహాకవికి లభించినవి. ఈ యవకాశమును పురస్కరించుకొని శకుంతల ననేక భంగిమలలో పఠితల హృదయ ఫలకములం దచ్చొత్తినట్లు చిత్రించినాడు. యేవర్ణములు మేళవింప నక్కరలేకయే మహాకవి కలమే కుంచెగా ప్రవర్తిల్లినది. శాకున్తల నాటకమ్మను నాల్బమునందు నాయిక యెన్నిభంగిమలలో గాన్పించునో వీక్షింతము.

పొంచియుండి శకుంతల సౌందర్యామృత రసాస్వాదనుండైన దుష్యంతుని మునికన్యలు చూడలేదు. ఇంతలో తుమ్మెద యొకటి శకుంతల మోముపై వ్రాలి బాధింపదొడంగె. భ్రమరబాధితురాలగు శకుంతల నిట్లు వర్ణించినాడు. "యతో యతః షట్చరణోభివర్తతే, తతస్తతః ప్రేరితలోలలోచనా. వివర్తిత భ్రూరి యమద్య శిక్షతే భయాదకామాపిహి దృష్టి విభ్రమం" తద్బాధా నివారణకై రాజు హఠాత్తుగా శకుంతల యెదుట ప్రత్యక్షమయ్యెను. తుమ్మెద బారినుండి శకుంతలను రక్షింపనేతెంచిన రాజుం గాంచి మునికన్యలచ్చెరుపాటుతో ప్రశ్నించిరి. యుచిత మర్యాదల నెఱపిరి. కాని నాయికలో మాత్ర మపుడే మార్పు చూపట్టినది. సఖులు సంభాషణ కుపక్రమించిరి. శకుంతల మాత్రము లజ్జతో తలవాల్చి కూర్చున్నది. తపస్సు చక్కగా వర్ధిల్లుచున్నదా! యని పృచ్ఛించినాడు. శకుంతల మాటాడలేదు. రాజును చూచినంతనే తపోవనంబున గనరాని మనోవికార ముదయించినది. కాని పైకి పొంగలేదు. రాజుకూడా లోగడ ప్రియంవదానసూయల సంభాషణనుబట్టి శకుంతల కణ్వుని కూతురనియు, వివాహము కానున్నదనియు మోహపడెను. ధర్మపాలకుండగు రాజు మునికన్య నాసింపరాదు. కాని ఆసగల్గినది. అందువల్ల నామె నృపపరిగ్రహ యోగ్యయను భావము గల్గినది. శకుంతల జన్మవృత్తాంత మెరుంగగోరినాడు. వారు చెప్పిన గాథవల్ల సంశయముతీరి, గాఢానురాగము గల్గి, గాంధర్వ వివాహమున కాసించినాడు.

ఇచ్చట శకుంతల సందేహము తీరలేదు. నాయికాపాత్రయొక్క యౌచిత్యమును గుర్తింపవలసిన ప్రధానఘట్టమిదియే. తండ్రిగారి యనుమతి లేనిదే తన మనస్సులో కోరినవాడైనను వివాహమాడుటెట్లు? ఈ విచారముతో ధర్మము, ఆచారము అడ్డగునేమోయను భీతియు పెనగొన్నవి. రెండవ సమావేశమున రాజు సంశయముతీర్చి రాచకన్నియలకు గాంధర్వ వివాహము నిషేధములేదని నచ్చచెప్పినాడు. అనసూయకూడా ధైర్యము చెప్పినది. కాని లౌకిక వ్యవహార సంశయము సంభవించెను. రాజుల కనేకమంది భార్యలుందురు. అందులో తన స్థానమెద్ది? యను అనుమానము. అనసూయ ప్రశ్నకు రాజిచ్చిన వాగ్దానమువల్ల నామె వివాహోన్ముఖురాలయ్యెను. అప్పుడే యామె రాజుతో ప్రత్యక్షముగా మాట్లాడినది. ఈ సందర్భములో శకుంతల మర్యాదయును, పూర్వాపర విమర్శనా జ్ఞానమును, సౌశీల్యమును గమనార్హములు, ధర్మనియమమును, లౌకిక లాభమును మున్నగునన్ని విషయములను సమగ్రముగా విచారించియే గాంధర్వ వివాహమున కంగీకరించెను. ఇది పాత్రపోషణ.

ఇచ్చట నింకొక విషయ మాలోచింతము. మూలమున ననగా భారతమునలేని యనసూయాప్రియంవదల నిందు కాళిదాసు ప్రవేశబెట్టినాడు. వారి నిందు నాయికకు నెచ్చెలులుగా నుపయోగించుటయే గాదు. సూక్ష్మముగా పరికించినచో కవి భావము వ్యక్తమగును. దుష్యంతుడు పల్కిన "అహో సమవయో రూప రమణీయం సౌహార్ద్రం భవతీనాం" అను వాక్యముచే సౌందర్యవతుల మధ్య నుండుటచే శకుంతల సౌందర్య మినుమడించునగదా? ఇది కళారహస్య వేత్తయగు కాళిదాసుని నూత్నపోకడ.

## కాళిదాస మహాకవి నాయికా చిత్రణ శాకుంతల

మనమిక శకుంతలను మారీచాశ్రమమున పరికింతము. అప్పటికి మాతృస్థానమందినది. తపోనిష్ఠితురాలై యదితి సాన్నిధ్యమున నున్నది. ఈ రూపము మిక్కిలి ధర్మకీయము ప్రియా వియోగము - కాదు కాదు ప్రియు నిరాదరణ చేగల్గిన హృదయవేదన, పుత్రోదయము చేగల్గిన సంతోషము, భర్తృసహచర్యమే నాటికైనను బొందలేనేమోయను నిర్వేదమును సమ్మిళితమైన యారూపమును రాజుచే నిట్లు వర్ణింపజేసినాడు, "ఇయమత్రభవతి శకుంతలా వసనే పరిధూసరే వసానా నియమక్షామముఖీ ధృతైకవేణీ, అపినిష్కరుణస్య, శుద్ధశీలా మమదీర్ఘం విరహవ్రతం బిభర్తి" పశ్చాత్తప్తుడగు దుష్యంతుని వాక్యములివి. యుత్కంఠతతో సమీపించిన రాజుం గని శకుంతల దుఃఖింపలేదు, సంతోషింపలేదు. జ్ఞానివలె నిర్వికారగముగానున్నది, కాని యుంగరము సంగతిచెప్పి తనతప్పు నొప్పుకొన్న తర్వాత మాత్రము దుఃఖమొచ్చినది. అదితి కశ్యపుల యాశీస్సులతో భార్యాబిడ్డల చేకొనినాడు. ఇప్పుడు శకుంతల యానందమునకొక తార్కాణము. తన్ను భర్త పరిగ్రహించిన వార్త కణ్వున కెఱుక చేయదలంచినది. ఆనందసమయములందు హిందూసుందరులు తలిదండ్రుల నెంచుకొనుట పరిపాటియేగదా ? మధురమైన శకుంతల హృదయభావముకూడ విడనాడక చిత్రించెను. నిండుకుండ తొణకదనునట్లు శకుంతల భావము మాత్రమే చెప్పినాడు కాని మాటలుమాత్ర మదితినోటినుండి వెల్వరించినాడు. ఇట్టి అపూర్వ సన్నివేశములు కాళిదాసుని కళావైదగ్ధ్యమునకు చిహ్నములు. ప్రణయము దివ్యమైనది చాటుటే మహాకవి యుద్దేశ్యమై యుండనోపు. కావున నమ్మహాకవి పూర్తిగా సంకల్పసిద్ధి బొందినాడు. శకుంతల సహనము, ధైర్యము చక్కగా వర్ణించి తుదకామెను మనకు ప్రౌఢగనే చూపినాడు. అనాఘ్రాత పుష్పమ్మగు శకుంతల చెలువమును. "చిత్రేనివేశ్య పరికల్పిత సత్త్వయోగా రూపోచ్చయేన విధినామనసాకృతాను స్త్రీరత్నసృష్టి రపరా ప్రతిభాతి సామే ధాతుర్విభుత్వమను చింత్య వపుశ్చతస్యాః" ఇత్యాది ధాత చిత్రచా మహాకవి చిత్రచా రసజ్ఞులు నిర్ణయింతురుగాక. యిట్టి అపరూప సౌందర్య రూప ముగ్ధులైపోయి రసప్రవంతిలో మునింగిపోవునట్లు చేయుటచేతనే కాళిదాసు మహాకవియైనాడు. శకుంతలా యుక్తుండగు నమ్మహాకవి మైలోకమలరు సోనలు గురిపించినది. నిజముగా శాకుంతలమురంగు, మృదుత్వము, మకరందము, సౌరభము, సౌందర్యములతో విలసిల్లెడి దివ్యప్రసూనమువంటిది.

(ఆలిండియా రేడియోవారి సౌజన్యముతో)



★ ★
★

నేషనల్ ప్రొడక్షన్సువారి
తెలుగు 'సింగారి' చిత్రంలో
లలిత.

★
★ ★

#  పట్టుచీర 

శ్రీ ఏకుమళ్ల కామేశ్వరరావుగారు

(గతసంచిక తరువాయి)

అతను "ఆరంగుపదిలే ఎత్తుకనపడదు. నిష్కారణంగా నాపట్టు, పంచ పాడు చేశావు. సంగతి సందర్భాలు బాగా ఆలోచించకుండా చేసినందుకు తగినశిక్షయింది" అని విచారించేడు.

కామాక్షమ్మ ఎంతో నొచ్చుకొంది. "ఈమారు దీని సంగతి బాగా కనుక్కొంటాను. తగినవాళ్లనడిగి మరీ చేస్తాను" అంది. ఆమెకి తటాలున ఏదో ఆలోచన పుట్టింది. "ఏమండీ! సరేకాని మీరు రోజూ న్యూస్ పేపరు కెందుకు డబ్బు తగలేస్తున్నారు" అని ప్రశ్నించింది.

శివపాదానికి నవ్వువచ్చింది. "లోకంలో వార్తలు తెలుసుకోడం అత్యవసరం. మన దేశపు రాజకీయ పరిస్థితులు తెలుసుకోవలసిన బాధ్యత మునపటికంటె ఇప్పుడెక్కువయింది. ఇప్పుడు నువ్వూ, నేనుకూడ ఓటిచ్చి శాసన సభలకి సభ్యులను పంపించాలి. అంచేత రోజూ నువ్వుకూడ పేపరు చదువుతూ ఉండు. తెలుగు పేపరే కాదూ?" అన్నాడు.

కథ అడ్డం తిరిగిందే అనుకొంటూ కామాక్షమ్మ చప్పగా ఊరుకొంది.

ఆనాటికి చర్చ చాలించేరు. ఆలుమగల్లు ఖర్చులు క్లుప్తం చెయ్యడంకోసం తంటాలుపడ్డారు.

మూడు నెలలు గడిచేటప్పటికి కామాక్షమ్మ చేతులలో ఏదో కొంత గలగలలాడింది. కాని భర్త ఎదుట పెట్టలేదు. శివపాదానికి పొదుపు ఆజ్ఞలను గురించి మంచి పట్టుదల ఏర్పడింది. అతను భార్యతో "అన్నిటికంటె ముఖ్యమైన విషయం ఒకటుంది" అన్నాడు.

"ఏమిటేమిటి?" ఆ కామాక్షమ్మ వినడానికి తొందరపడింది.

"మనం ఒక ఉపవృత్తి పెట్టుకొని ఇప్పటి ఆదాయానికి మరికొంత చేర్చాలి" అని నెమ్మదిగా వెలిబుచ్చేడు.

కామాక్షమ్మ సంతోషాన్ని ప్రకటించింది.

"దానంత మంచిపని మరొకటి లేదనుకో!" అంటూ శివపాదం ఒత్తిచెప్పేడు.

కామాక్షమ్మ ఏదో కొత్త సామ్రాజ్యం జయిస్తూన్న దానిలాగున కనబడింది. "అయితే ఏమిపని చేస్తానంటారు?" అని ప్రశ్నించింది.

"ఉపవృత్తి అంటే నాఒక్కడికే కాదు. అది నేను చేసేపని అయితే నేను చెయ్యవచ్చు. నువ్వు చేసేపనయితే నువ్వుచెయ్యవచ్చు" అన్నాడు భర్త.

"అప్పడాలు, వడియాలు, పచ్చళ్లు ఇవి కూడ దానిలోకే వస్తాయా ?" అని ప్రశ్నించింది ఇల్లాలు.

"ఔను!"

"నేను వాటినిచేసి వర్తకం పెట్టలేను. ఇంటికి చాలినవి చేసుకోంటే చాలుతొండి!" అని ఆమె వెనకంజ వేసింది.

"అది కాకపోతే మరొకటి" అన్నాడు భర్త.

"పోనీ మీరు ఏ వాచీలో బాగుచేస్తేనో, లేకపోతే ఫోటోగ్రాఫులు తియ్యండి" అని అందించింది కామాక్షమ్మ.

"ఒకమాట అనగానే సరిపోయిందీ! నిన్ను వీణ వాయించమంటే నాలుక వెళ్ల బెట్టినట్లుగానే ఉంటుంది. ఒక గంటలోనూ ఒకరోజులోను వచ్చే విద్యలు కావవి!"

"అయితే ఏమిటి చేస్తానంటారు ?"

"మనమిద్దరం చెయ్యగలిగిన ఉప వృత్తిగా ఉండాలి" అన్నాడు భర్త.

కామాక్షమ్మ దీర్ఘంగా ఆలోచించింది. "ఏమండోయి ఒకపనిచేస్తే ఎంతేనా బాగుంటుందండి!" అని చెప్పకముందే ఎంతేనా మురిసిపోయింది.

"అదేదో నాకుకూడ చెప్పు. నన్నుకూడ సంతోషించనీ!" అన్నాడు భర్త.

"మనం ఒక ఆవునికొని పాలు అమ్మితే!" అంది.

శివపాదానికి ఎదుట పరహాలకుప్ప కన బడినట్లుయింది. ఇద్దరూ 'బాగుందంటే బాగుంద'ను కొన్నారు.

"అయితే మొదట ఒక ఆవుని సాధించాలిగా!" అంది భార్య.

"ఆవుని సాధించడానికి ఏమంత శ్రమ పడక్కరలేదు లే. మొదట మనం నాలుగు రోజులపాటు ఎవరి పశువునేనా తెచ్చి, దానిలోఉండే కష్టసుఖాలు తెలుసుకొని తర్వాత కావలిస్తే మంచి ఆవుని కొనుక్కొందాం" అన్నాడు.

కామాక్షమ్మ ఆవుని పెంచడానికి ఎంతో ఉబలాటపడింది.

ఆవుని సాధించడంలో శివపాదానికి ఆట్టేశ్రమ కలగలేదు. ఎందుచేతంటే అతని స్నేహితుడొకడు సంక్రాంతి పండుగకు సకుటుంబంగా అత్తవారింటికి వెళుతున్నాడు. అతని ఇంటిలో పాడిపశువుంది. దానిని ఎవరికేనా అప్పగించి వెళదామని ఆలోచిస్తున్నాడు. శివపాదానికి ఆ సంగతి తెలిసి స్నేహితుడితో "నువ్వు తిరిగి వచ్చేదాక ఆవుని మాపెరటిలో కట్టివేస్తే ఇంతగడ్డి పడేస్తూంటాం" అని చెప్పగా, ఆ స్నేహితుని నెత్తిమీది భారం తొలిగినట్లుగా కన్పడ్డాడు.

శివపాదం, ఆవుని దూడని తోలుకు వచ్చేడు. పెరటిలో రెండు రాటలు పాతి పెట్టి ఆవునివేరు, దూడనివేరుగా కట్టివేసి, వాటికి ఇంత గడ్డి పడవేశారు.

"పసిబిడ్డ పాడావు ఒకటన్నారు పెద్దలు" అని ఉత్సాహంతో ఆవుకి దాణాపెట్టింది కామాక్షమ్మ. పాలవాడువచ్చి పాలుపితికేడు. 'ఇవాళ పాలన్నీ మనమే భరిద్దాం" అంది కామాక్షమ్మ

మర్నాటి పొద్దున్న గొల్లవాడువచ్చి పొలానికి ఆవుని తోలుకుపోయేడు. "సాయంత్రమయింది. ఆవు ఇంటికి రాలేదేమా?" అనుకొంటూ దంపతులిద్దరు ఎదురుచూస్తున్నారు. గొల్లవాడువచ్చి "ఆవు ఎక్కడికో పారిపోయిందండి! వెతుక్కురావడానికి నాకు తీరుబాటులేదు. ఎవరినేనా పంపించండి!" అని కేకవేశాడు.

కామాక్షమ్మ శివపాదం ఒకరిమొహ మొకరు చూసుకొన్నారు. ఆవుని వెతకడానికి మొదట ఒకణ్ణి పంపించాలి. లేనిపోని తద్దినం ఇదొకటి తెచ్చిపెట్టుకొన్నామే" అనిపించింది కామాక్షమ్మకి. శివపాదం భావాలు మాటలకి అందడంలేదు. ఏలాగైతేనేమి ఆవుని వెతకడానికి ఒకణ్ణి పురమాయించేరు. ముచ్చటగా జరపదలచుకొన్న సంక్రాంతి పండుగ ఆవుకోసం ఆరాటంగా మారింది. ఏలాగో వెతికిపట్టుకొని, పండగ ఆఖరిరోజున ఇంటికి తీసుకువచ్చేరు. వెతికిన వాడికి రెండు రూపాయలిచ్చుకోవలసి వచ్చింది. "అంతా తలక్రిందులుగా వచ్చిందే!" అని శివపాదం విచారించేడు. మన్నాటి పొద్దున్న స్నేహితుడు ఊరినుంచిరాగా ఆవును అతని ఇంటికి తోలివేశారు.

"ఈ ఉపవృత్తి మనమనుకొన్నంత సుళువుగా కనపడడంలేదు" అంది కామాక్షమ్మ.

"మరికొంతకాలం పోనిచ్చి దానిని గురించి మళ్లీ ఆలోచించుదాం" అన్నాడు శివపాదం.

అట్లాగే అన్నట్టుగా ఆమె ఊరుకొంది.

కామాక్షమ్మ ఒబ్బిడితనంవల్ల నెమ్మదిగా నాలుగు పదిరూపాయల నోట్లు చేరేయి. ఒక రోజున ఆ నోట్లను పైకితీసి భర్తతో "ఏమండోయి! నాకు పట్టుచీరె తెచ్చిపెట్టాలి!" అంది.

డబ్బు చూడగానే భర్తకి కళ్లుకుట్టేయి. "నాకు దుస్తులులేవు రెండు సూట్లు కుట్టించుకోవాలి. పైగా నువ్వు నాపంచ చొక్కాపాడుచేసి పెట్టేవు!" అని నేరం మోపేడు.

"ఇంక ఆ మాటలు కట్టిపెట్టండి. నేను కష్టపడి సంపాదించుకొన్నాను కాబట్టి ఆ డబ్బు నాది" అంది భార్య.

"నేను జీతం తేకపోతే నువ్వు ఎక్కడినుంచి సంపాదించే దానివి?" అని ప్రశ్నించేడు భర్త.

"అయితే మీ జీతంలోది మీరు ఇంతకాలం ఎందుకు మిగల్చలేక పోయేరు?"

"అదంతా నాకెందుకు?" అన్నాడు భర్త.

"కష్టపడి మిగిల్చేను కాబట్టి నాది!" అంది భార్య.

"అదంతా నాకు తెలియదు. వీధిలోకి వెళ్ళేవాణ్ణినేను. నాకు గుడ్డ ముక్కలు లేకపోతే ఎట్లాగు బతకను" అని గట్టిగా అన్నాడు భర్త.

"ఒక పేరంటానికి వెళదామంటే శుభ్రమైన గుడ్డముక్క లేదు. ఈ ముష్టిగుడ్డ తప్పితే మరొక గుడ్డముక్క లేదు. కనుక పట్టుచీర నేను కొనుక్కోక తప్పదు!" అంది భార్య చెయ్యి ఊపుతూ.

ఈ సంవాదన తెగేటట్లా శివపాదానికి కనబడలేదు. అతను ఒక ఎత్తు ఎత్తేడు. "అయితే ఒకపని చేద్దాం. ఒక చీటిమీద సూట్లు అని, మరొక దానిమీద పట్టుచీర అనిరాసి, మడతపెట్టి, ఎగరవేసి అందులో ఒకచీటి తీద్దాం" అన్నాడు.

అది సబబుగానే కనపడింది ఇల్లాలికి.

రెండు చీట్లు తయారు చేశారు.

"వాటిలో ఒకటి కళ్లుమూసుకొని తీస్తాను" అన్నాడు శివపాదం.

"ఏమండోయి! ఆ పప్పులన్నీ నాదగ్గర ఉడకవు! మిమ్మల్ని ఎవడు నమ్మమని చెప్పేడు. బాలవాక్కు బ్రహ్మవాక్కు అన్నారు పెద్దలు. అందేత పసిపిల్లాడిచేత ఆ చీట్లలో ఒకటి తీయించుదాం" అంది.

ఆ ఊహ వర్వాలేదన్నట్లుగా తోచింది శివపాదానికి.

పుట్టిన రోజుకి తాను పేరంటానికివెళ్లిన కుర్రవాణ్ణి తీసుకు వచ్చింది కామాక్షమ్మ.

రెండు చీట్లుకలిపి అక్కడ పడవేశారు.



'సింగారి'లో లలిత, పద్మిని.

"వాటిలో నా చీటితియ్యి చిట్టినాన్నా!" అని పిల్లవాణ్ణి ముద్దాడింది.

భార్యాభర్తలు ఆత్రంగా చూశారు.

పసివాడు ఒకచీటిలాగి ఇవతల పడవేశాడు. ఆచీటివిప్పి చూసుకొన్నారు. "పట్టు చీర!" కామాక్షమ్మ విరగబడినవ్వింది.

శివపాదం దిక్కులు చూస్తూ కూర్చున్నాడు.

"న్యాయమైన సొమ్ము నష్టేటిలోపడ్డా పోదంటారు పెద్దలు" అంది కామాక్షమ్మ.

శివపాదం పట్టుచీరె కొని తెచ్చేడు. భార్య ఎంతో ముచ్చటగా కట్టుకోగా దంపతులు ఆనందించేరు.

(ఆలిండియా రేడియోవారి సౌజన్యముతో)

# గుణపాఠము

శ్రీ చీమలపాటి సూర్యనారాయణగారు

మా యింటికి ఎడమప్రక్కన చిట్టి నివసిస్తూన్న గృహముంది; వారి మేడకిటికీ, మా మేడ కిటికికి యెదురుగా నేయుంది. నేను నాగదిలోఁ గూర్చుని, కిటికీ వూచలద్వారా చూచినట్లయితే, వారి మేడగదిలో ఏమి జరుగుచున్నదీ, స్పష్టంగా గోచరిస్తుంది.

నేను నిత్యమూ నాగదిలో పడక కుర్చీలో పండుకొని, పత్రికలు చదువుకొనే వేళ, సోమయాజులగారి కూతురు: చిట్టి కేశ సంస్కారమూ, తదితర మయిన పనులు చేసుఁగునే వేళ, ఒకటయేది. నేను పత్రికను చదువుతూండే వాడినేఁగాని, దృష్టి మాత్రం చీఁటికీ మాఁటికీ చిట్టివయిపు మరలి పోయేది; ఆమె ప్రతిచర్యనూ గమనిస్తూండే వాడిని.

నిఁడుదలై, సొగసయిన కేశములకు తైల సంస్కారము చేసుఁగుని, గంటల తరఁబడి విసుఁగు చెందకుండా, తలను చక్కగా దువ్వుకుని, తలలో పువ్వులను తురుముకునేది. ఆమె కేశ సంస్కారములో తీసుఁగుంటూన్న శ్రద్ధ మరి యే స్త్రీ తీసుకొనదంటే మీ రాశ్చర్య పోవద్దు!

ఆమె దువ్వుకొనుచు, నావయిపు మధ్య మధ్య చూస్తూన్న చూపులు నాహృదయ కరండములలో నిహితమైయున్న అవ్యక్త మధుర వాంఛలను గాఢ సుషుప్తిలో నుండి మేల్కొల్పేయి. ఆమె శరీర సౌందర్యము, యౌవనఁపు బిఁగువు నన్ను పిచ్చివానిగా చేసేవి. ఆమెతో మాట్లాడాలని ... స్నేహము చేయాలని .. ఏవేవో పిచ్చియూహలు నాహృదయాంతరాళములో జనించక పోలేదు. అందుకే ఆమె వయిఁపు నిత్యమూ యాశగా జూస్తూ, చిట్టిని కల్సుఁగునే మధురక్షణముకై ఎదురుఁ జూస్తున్నాను. చిట్టి నావైపుఁజూచినప్పుడెల్లా, నా శరీరము గగుర్పాటు పొందుతూ, ఏదో చెప్పరాని యానందములో తేల్పేది!

మా యావిడా, నేను ఎంతో అన్యోన్య ప్రేమానురాగములతో యుంటున్నాము; మా ఉభయులం మధ్యా ఎన్నఁడూ; లావాదేవీలుఁగాని, పిలకా పిరికీలుఁగాని, తర్జన భర్జనలుఁగాని లేవనే చెప్పాలి! ఒడ్డు పొడుఁగులందైతేనేమి - అందచందములందైతేనేమి - మాటల స్వరాల్లో ఐతేనేమి, మా ఆవిడకు, చిట్టికి యిసుమంతైన భేదమయినా లేకపోయినప్పటికీ, ఛాయలో మాత్రం ఎటొచ్చీ మా 'శ్రీకాంతే' చిట్టికంటే తక్కువని చెప్పాలి.

చిట్టి - మేనిఛాయలోని యింద్రధాపపు వొంపు రంగులు, ధళ ధళమని మెరిసేవి; నడకలో కేకిని నృత్య భంగిమలు వుట్టిపడేవి; మరుద్దామన్న మరుఁపు రాకున్నాయి; ఆమె కౌగిట్లో సుఖించాలన్న కోర్కె నాకు జనించక పోలేదు.

ఆనాఁడు నాయలవాటు ప్రకారము నాగదిలోఁ గూర్చుని, పత్రికా పఠనముఁ జేస్తున్నాను. చిట్టి తన యలవాటు ప్రకారము కేశములకు తైల సంస్కారము చేసుఁగుంటూంది. పత్రిక చదువుతున్నానేఁగాని, దృష్టిమాత్రము ఆమె ప్రతిచర్యను గమనిస్తున్నది. మనస్సు మనస్సులో లేదనే చెప్పాలి! ఆమె వయిఁపు దీక్షగా చూడటం బాగుండదన్న కారణంచేత, అప్పుడప్పుడూ చూస్తున్నాను. ఆమె గూడా నాకుమల్లే నటిస్తూంది.

కొంతకాలము తరువాత - అప్రయత్నముగా అనుకోకుండానే మాయిరువురి చూపులూ క్షణ కాలము కల్సుకుని, మాయిరువురి హృదయములలోని బాధలను వొకరికొకరికి వ్యక్త పరచుకున్నాయ్! చిట్టి అప్రయత్నముగా నావయిపుఁజూచి నవ్వింది. ఆనవ్వు నన్ను ఆనందములో తేల్చి, తీఁగి నాభుజం మీఁది చొక్కా చిరుఁగును గమనించేంకేటి బొబ్బిలి మానవునిగా మార్చివేసింది.

"అదంతా నాకు తెలియదు. వీధిలోకి వెళ్ళేవాణ్ణినేను. నాకు గుడ్డ ముక్కలు లేకపోతే ఎట్లాగు బతకను" అని గట్టిగా అన్నాడు భర్త.

"ఒక పేరంటానికి వెళదామంటే శుభ్రమైన గుడ్డముక్క లేదు. ఈ ముష్టిగుడ్డ తప్పితే మరొక గుడ్డముక్క లేదు. కనుక పట్టుచీర నేను కొనుక్కోక తప్పదు!" అంది భార్య చెయ్యి ఊపుతూ.

ఈ సంవాదన తెగేటట్లు శివపాదానికి కనబడలేదు. అతను ఒక ఎత్తు ఎత్తేడు. "అయితే ఒకపని చేద్దాం. ఒక చీటిమీద సూట్లు అని, మరొక దానిమీద పట్టుచీర అనిరాసి, మడతపెట్టి, ఎగరవేసి అందులో ఒకచీటి తీద్దాం" అన్నాడు.

అది సబబుగానే కనపడింది ఇల్లాలికి.

రెండు చీట్లు తయారు చేశారు.

"వాటిలో ఒకటి కళ్లుమూసుకొని తీస్తాను" అన్నాడు శివపాదం.

"ఏమండోయి! ఆ పప్పులన్నీ నాదగ్గిర ఉడకవు! మిమ్మల్ని ఎవడు నమ్మమని చెప్పేడు. బాలవాక్కు బ్రహ్మవాక్కు అన్నారు పెద్దలు. అందేత పసిపిల్లాడిచేత ఆ చీట్లలో ఒకటి తీయించుదాం" అంది.

ఆ ఊహ పర్వాలేదన్నట్లుగా తోచింది శివపాదానికి.

పుట్టిన రోజుకి తాను పేరంటకానికివెళ్లిన కుర్రవాణ్ణి తీసుకు వచ్చింది కామాక్షమ్మ.

రెండు చీట్లుకలిపి అక్కడ పడవేశారు.



'సింగారి'లో లలిత, పద్మిని.

"వాటిలో నాచీటితియ్యి చిట్టినాన్నా!" అని పిల్లవాణ్ణి ముద్దాడింది.

భార్యాభర్తలు ఆత్రంగా చూశారు.

పసివాడు ఒకచీటిలాగి ఇవతల పడవేశాడు. ఆచీటివిప్పి చూసుకొన్నారు. "పట్టుచీర!" కామాక్షమ్మ విరగబడినవ్వింది.

శివపాదం దిక్కులు చూస్తూ కూర్చున్నాడు.

"న్యాయమైన సొమ్ము నట్టేటిలోపడ్డా పోదంటారు పెద్దలు" అంది కామాక్షమ్మ.

శివపాదం పట్టుచీర కొని తెచ్చేడు. భార్య ఎంతో ముచ్చటగా కట్టుకోగా దంపతులు ఆనందించేరు.

(ఆలిండియా రేడియోవారి సౌజన్యముతో)

నాకు కాల పిపాసము కాకుండా కాఫీ త్రాగటం అలవాటు! అటువంటిది యీనాఁడు కాఫీ త్రాగేందుకు కాలక్షేపించుటకు కారణమేమిటో తెల్సుకోవాలనే కుతూహలం మాయావిడకు జనించటం సహజమే! అందుచేతే నాగదిలోకివచ్చి నూయిరుపుని చర్యలను కనిపెట్టింది. యీవిషయం కొంత కాలం పోయిన తరువాత తెలిపింది లెండి!

"కాఫీ చల్లారి పోతూంది; గమ్మున రండి! పిల్చి పిల్చి నాగొంతు తడారిపోయింది." అంది. ఒక్క మారు త్రుళ్లి పడ్డాను: గుండెలు గతుక్కుమన్నాయి. యింక మాయావిడ చేత, చీవాట్లు తప్పవనుకున్నాను... కానీ మా శ్రీకాంత యీవిషయం ఎప్పటికీ ప్రస్తావించక పోవటంచేత నాగుండెలు గూట్లోకి వచ్చేయి.

ఆవేళ నాకు సెలవు కావటంచేత, మిల్లు డ్యూటీకి వెళ్లక, తీరుబడిగా మధ్యాహ్నం నా గదిలో పఁడుకుని, కరెంటు 'గృహలక్ష్మి' రాక పోవటంచేత, లైబ్రరీ నుండి తెచ్చిన పాత (Previous) గృహలక్ష్ములను తిరగవేస్తున్నాను... యింతలో మాయావిడ పనిపాట్లను ముగించుకుని తమలపాకులతో నాదగ్గరకు వచ్చింది; చేరువులో కూర్చుంది. సున్నమును రాసిన తమలపాకులను అందిస్తూ.

"ఏమండీ, గృహలక్ష్మికి నేను పంపిన కథనింకా ప్రచురించలేదేమండీ, ఆర్నెల్లుకావస్తూన్న!"

"అవకాశం, స్థలం దొరకాలంటూవా? ప్రచురిస్తారు; ప్రచురిస్తామనట్లు కార్డు వ్రాశారాపోని"

"లేదు?" అంది, "అయితే కల్సిపోయింది-" పెద్దగా నవ్వుతూ అన్నా!

"ఎందులో?" అని ప్రశ్నించింది. "విశ్వసార స్వతార్ణవంలో-" అన్నా.

"పోనీలెండి, పీడాపోయింది. యికనుండి యీ కాగితాల దండగే వుండదు; ఎర్ర ఏగాణి ముట్టాలా? పత్రిక రావాలా? ఏదీలేదు!"

"అంతలోకే అంత నిరుత్సాహమా? ఓపిక వహించాలి! ప్రయత్నం మీఁద ప్రయత్నం చేయాలి; యింకా చాలకపోతే బ్రూసు - సాలీడుమల్లే ప్రయత్నం చేసి ఫలితం పొందాలి!"

"మొదటి ప్రయత్నానికి విఘ్నం కలుగుతే నిరుత్సాహం తప్ప, ఉత్సాహ ముండదండి"... యింతలో ఎవరో వీధిలోనుంచి నన్ను పిల్వడం చేత మాయావిడ క్రిందకు వెళ్లి, తపాలా బంట్రోతు యిచ్చిన కవరు త్తరమును పుచ్చుకుని, నవ్వుకుంటూ, నాదగ్గరకొచ్చింది. చేతికందిస్తూ.

"పైవిలాసమును బట్టి చూడ, ఎవరో రాత సరిగా తెలియని స్త్రీ రాసినట్లుంది!" అంది. ఆద స్తూరి చూడగానే నామనస్సూ అనుమాన పడ సాగింది. కవరు చింపి లోపటి వుత్తరాన్ని మాటుగాఁదెరచి, చూశాను. పరిచయమున్న రాతలాలేదు; చివర్నివున్న సంతకాన్ని పరిశీలించగా వుబ్బి తబ్బిబ్బైపోయాను; సర్వాలో కాధిపత్యం యిచ్చినట్లు సంతోషించాను. వెంటనే వుత్తరాన్ని కవరు సంచిలోవుంచి, యథాప్రకారము పత్రికా పఠనము చేస్తున్నాను.

"ఎవరి దగ్గరి నుంచండి వుత్తరం" అని మాయావిడ ప్రశ్నించింది.

"ఎవరో స్నేహితుఁడు వ్రాశాడు!" అని నగ్న సత్యాన్ని కప్పిపుచ్చే ప్రయత్నములో తొందర పడలేదు.

"స్నేహితుడా?" చిన్నగా నవ్వింది... పత్రిక చదువుతున్నానేగాని, ధ్యాసంతా ఆవుత్తరం మీఁదే వుంది. హృదయ మెందుకో రెప రెప కొట్టుకుంటున్నాది. ఏవో అవ్యక్త వూహలు జనిస్తున్నాయి; నశిస్తున్నాయి! వుత్తరాన్ని చదువుదామనే తొందర, మాయావిడ ప్రక్కనుండటంచేత చల్లారి పోయింది.

ఇంతలో మాయావిడ లేచి, వొళ్లు విరుస్తూ, "టైం అయింది. కాఫీ కాచటానికి!" అంటూ,

క్రిందకు పోయింది. భగవంతుడికి పది వేల నమస్కారము లర్పించా మనస్సులో. వెంటనే వుత్తరాన్ని తీసి చదవ నారంభించాను.

మదీయ మనోమానస తస్కరా, ప్రణయ మనోజ్ఞ మూర్తి! వందనములు.

మీదర్శన భాగ్యమును అను నిత్యము నాకు కలిగిస్తున్న, ఆపరమేశ్వరునికి వందన శతము లర్పించుచున్నాను. సదా మీకనుసన్నలలో మెలగుతూ నామనోభిప్రాయమును నా చూపులుద్వారా, చేతలు ద్వారా తెలియఁబరచుచున్నప్పటికీ మీరు నిశ్శబ్దముగా వూరుకోనటం నాకోర్కె లను న్యూనత పరచిన వారౌతున్నారు.

మనోహరమూర్తి!

ఏపనిజేసినా మీసుందర దివ్యవిగ్రహమే కనఁబడేది. అన్నం సహించకుండా వుంది, కంటికి నిదుర పట్టుటలేదు; గాఢ నిద్రల్లో మధుర స్వప్నములలో పూర్ణస్పృహలో; మీదివ్యసుందరవిగ్రహమే ప్రత్యక్షమౌతూ పిచ్చిదానిగా చేస్తున్నాది.

ప్రభూ!

నామదిలోని కోర్కె లు మీమీద నిలిచాయి; మీరుకాదంటే నాజీవితం పరిదగ్ధం! నాయీకోర్కెలను వీలయినంత విపులముగా వ్రాశాను.

ఘనమయిన న్యాయమూర్తీ!

నాయవస్థ నర్థము చేసుఁగుని, సరియైన న్యాయము ను ప్రసాదిస్తారని, యీ అభాగ్యురాలు ఆశిస్తున్నాది. నిత్యమూ అంతరాత్మ యొక్క ప్రార్థనా మందిరములో కోర్కెలు జేగంటలై మ్రోగుతూన్నాయి మ్రోగేశబ్దమునకు మోసం చేయకండి! నాకోర్కెలను వితఁజేయవలదని నాప్రార్ధన! 'స్త్రీ తనకు తానై వలచి నపుడు, పురుషుడు చులకనచేస్తా' డన్న విషయాన్ని సార్థపరచకండి! నేను అబలను; నాకన్న కొద్దిపాటి జ్ఞానముతో వ్రాసిన యీయుత్తరములో అనేక పొరపాట్లు వుండవచ్చు; వాట్ని మన్నించాలి.

మరొక విషయం ప్రభూ!!

మీకొక యర్ధాంగి యుందన్న సంగతి తెల్సినప్పటికీ, మీమీద గాఢమయిన ప్రేమ, కోర్కెలు కలగటంచేత, నన్నీసాహస కార్యములోనికి దింపాయి. పరిస్థితులు తరుమారయినా, ఎవరైనా సరే ధిక్కరించి మీకౌగిట్లో సుఖించాలని మదీయ అభిలాష!

ప్రణయమూర్తి!

నన్నెప్పుడు, ఎక్కడ కల్సుకునేది యీదీనురాలు యీవుత్తరంలో వ్రాసుకుంది; గ్రహించ ప్రార్థన; మోసం చేయవలదని ప్రార్థిస్తు, ముగిస్తున్నాను. సెలవ్.

చిత్తగించ వలెను.

ఇట్లు

మీ చరణదాసి

చిట్టి

అని చదివి ముగించాను. అనుకోకుండా యిటువంటవకాశమును కలిగించినందుకు ఆతిరుపతి దేముడికి మొక్కు చెల్లించవల్సిందే!

చిట్టి లేఖారచనలోని మధురత్వం వైదగ్ధ్యం, నన్ను విస్మయుణ్ణిగా చేశాయి. నిజంగా చిట్టే యీ వుత్తరం వ్రాసిందా? యింత దగ్గర్లో ఆమె స్నేహం లభ్యమౌతూ, నాకోర్కె తీరే యవకాశము లభిస్తుందనుకోలా! చిట్టి నిర్ణయించిన రోజున ఆమెను కల్సుగునేందుకు నిశ్చయించాను.

ఆ దేసమయంలో నాహృదిలో వొక ధర్మసందేహమునకు తావివ్వక దప్పిందికాదు; వెధవది 'కాశ్మీగు సమస్య'లా బాధపెడుతూంది; చిట్టితో స్నేహం చేయటం, అన్నెము, పున్నెమెరుఁగని నా శ్రీకాంతకు ద్రోహం చేసిన వాడినౌతానేమో అని!

"పిచ్చివాడా! చిట్టి కోర్కెలనుఁ దీర్చినంత మాత్రాన, మీయావిడి కప్పుడే ద్రోహం తలపెట్టి నట్లే? నిన్నే 'కొండగానో, సుయ్యగానో' భావిస్తున్న

చిట్టి కోర్కెలను విఫలంజేస్తావా? కనుక మనస్సులో పిచ్చి అనుమానములకు తావివ్వక, చిట్టి చెప్పినట్లు ప్రవర్తించటం నాకు సమ్మతి" మంటూ, నా అంతరాత్మ వేయి నాలుకలతో ఘోషించి చెప్పింది ... తుదకు చిట్టికోర్కె ప్రకారము ప్రవర్తించేందుకు నిశ్చయించాను.

## 2

ఆనాడు చిట్టిని కల్సుకునే ఆనందకరమయిన దినం! (Red letter Day) ఆతొలినాంటి రాత్రి, ఆమరునాండు చిట్టి నేవిధంగా కల్సుకోవటం? ఎలా సంభాషించాలో? మున్నుగు మధురాలోచనలతో ఆరాత్రాంతా తీయగా గడిపాను; యీ అమర సంతోషంలో రాత్రి నిదుర పోక పోవటంచేత, సహజంగా మానవునికి కలిగే బాధ ననుభవించుట లేదు ... వేకువనేలేచి ఆదరా బాదరాగా కాలకృత్యములు ముగించుకుని నాయలవాటు ప్రకారము నాగదిని చేరుకున్నాను నాప్రియురాలి దర్శనం కోసమై!

అలా ఎంత సేపు వేచియున్నానో ఆ 'పులహలాండ పెరుమాళు' కెరుక! కానీ ఎంతవేచినా ఆచంద్రబింబపు మోము దర్శనమేలేదు. నిజముగా నిరుత్సాహామే జనించింది! ఏవో తొందర పనులుండటం చేత రాలేదనుకుని, హృదయాన్ని పదిల పర్చుకున్నాను.

యింతలో క్రింది నుంచి

"కాఫీ చల్లారి పోతూంది, రండి!" అంటూ మా శ్రీకాంత పిల్చింది. ఆనాడు ఏనాడూ వుండనంత వుత్సాహంగా వుంది. కాఫీకి తోడుగా నాకిష్టమయిన ఫలహారం చేసిపెట్టింది; అందుకు నేనాశ్చర్య పోయాను.

"ఎప్పుడూ లేంది, యివాళ ఫలహారం చేసిపెట్టేవే? విశేషం ఏమిటి కన్నదూ? యింతలోకే నీకివెర్రి యభిమానం కలిగిందేం?"

"వెర్రభిమానమా? మీరంటే నాకెంత ప్రేమా, ఎంతదయా!" అంది నవ్వుతూ.

"ఏమండీ, యివాళ సినీమాకు వెళ్ళాలని వుంది; ఏమంటారండి?" అని నిన్నంటి విషయాన్ని మరల, కదిపింది.

"నాకేం చెముండులేదు; నిన్ననే నీకు సమాధానం చెప్పానుగా!" అన్నా.

"సరేలెండి!" అంది ...

## 3

మా శ్రీకాంత రెండవయాంట కెళ్ళింది. నాకు స్వేచ్ఛకూడా కలిగింది. చిట్టి నిర్ణయించిన కాలం సమీపించటం చేత, చూడ చక్కగా టాయిలెట్ చేసుకుని, చలువం జేసిన బట్టలను ధరించి యింటికి తాళం వేసి బయలుదేరా! చీంకటి గాఢాంధకారంగావుంది; దారి నిర్దిష్టముగా కనబడక పోయినప్పటికీ, వెర్రి సంతోషంతో నడక సాగిస్తున్నాను.

చిట్టి నిర్దేశించిన స్థలములో ఏవరో వ్యక్తి నిల్చునట్లు మసక మసకగా గోచరమయ్యారు ... ఆమె చిట్టని తెలియగానే ... ఉద్రేకం ... ఉత్సాహం ... ఉరికి పొంగుతూంది. ఆమె సమీపమునకు వెళ్ళి,

"చిట్టీ!" అని మెల్లగా పిలిచాను ... దూరాన వున్న శ్రీరామాషుగరు మిల్లు హోరు తప్ప, మిగతా ప్రపంచమంతా నిశ్శబ్దముగావే వుంది.

"ఉష్ ... మెల్లగా ... మీదర్శన భాగ్యమున కెదురుం జూస్తూన్న, మీచరణదాసి చిట్టే! ... యిల్లా యింట్లోకి రండి; మనసార మాట్లాడుకుందా" మంటూ దారి తీసింది.

"ఉత్తరం వ్రాశావేంగాని వస్తావో, రావో అని నేనెంత భయపడ్డా ననుకున్నావ్? ... అబ్బ ..." అంటూ ఓదీర్ఘ నిశ్వాస విడచాను.

"ఉత్తరం వ్రాశానేగాని ... మీరు వస్తారో రారో "అని నేనెంత భయపడ్డాను!" మీరు మాట తోసేయకుండా వచ్చినందుకు నాకృతజ్ఞత!" అంది ... "మీరు నాకు కనంబడని రోజున నేనెంత పిచ్చిదానిగా మారిపోయానో ఆభగవంతుడికి తెలియాలి!" అంటూ దగ్గరికి వొచ్చింది.

ఇలా రెండుగంటల కాలము గడిచినది.

"చిట్టీ; యింక మనం యింటికి పోదాం పద" అంటూ, లేచా! నడుస్తూ.

"నాదో మనవి - " అంది.

"ఏమిటది?" అక్కజంగా అడిగారు. "ఎన్నాళ్లు మనకీ దొంగ బ్రతుకు చెప్పండి? మీమీద ప్రేమ నన్ను పిచ్చిదానిగా చేసింది; మిమ్మల్ని దప్ప అన్యుల్ని యీహృదయం కోరటం లేదు; మీ భార్య



మీకు తగిం కాదు; ఎటువంటి సంకోచం పెట్టుకోకుండా నామనవి ప్రకారం ఎక్కడ కయినా పోయి, సుఖమయన జీవితం గడుపుదాం; తరగని బంగారం నాదగ్గరుంది లెండి!" అని ఆవేశంగా మాట్లాడింది.

"నీవింత తొందర పడకూడదు చిట్టీ; ఏదయినా పూర్వాపరము లాలోచించి పనిచేయ్యాలి ... నాకు కాలవ్యవధియ్యి; ఆలోచించి చెపుతా. ఏదెట్లున్నా నన్నే సర్వం నమ్మకున్న మా శ్రీకాంత గతి?"

"ఆత్మీయుల్ని; బంధువులనుగూడా ధిక్కరించి, మీరే అని నమ్మకుని. పరివ్రాజికమల్లే సర్వసంగపరిత్యాగము చేసి; యీవలబడ్డ యీచిట్టిమాటో?" అంది. గొంతుకలో వెలక్కాయ పడ్డట్టయింది! మౌనంగా నడుస్తున్నాము ... మాయింటి తలుపు తెరిచాను. నా వెంబడే చిట్టిగూడా వచ్చింది. మా యావిడ సినీమానుండి వచ్చేవేళవటం చేత, గాబరా పడసాగను దీపాన్ని వెలిగించే ప్రయత్నంలో అగ్గిపెట్టెను వెతుక్కుతూ.

"చిట్టీ నువ్వు చెప్పిన విషయమై ఆలోచించి చెపుతా యివాల్టికి యింటికిపో!" అని బ్రతిమాలా

"ఏమయినాసరే; మిమ్మల్ని నమ్మకున్న తరువాత; యిక కదల దల్చుకోలేదు." అంది ... యీమె మాటలధోరణి మాయావిడ వచ్చేవేళ; నన్ను భయవిహ్వాలునిగా చేస్తున్నాయి. దీపం వెలిగించి; చిట్టిని మాయమాటలతో సాగనంపుదామనుకుని వెనక్కు దిరిగాను.

ఇంకేముంది? గుండెలు గతుక్కుమన్నాయి; నిలువునా నీరైపోయాను. శిఖండి హృదయంతో నిలబడిపోయాను. 'ఆమె' మా ఆవిడే అని తెల్సుకున్న తరువాత; మా శ్రీకాంత ముఖంలోకి చూడలేక పోయాను! మాయావిడింత నాటకమాడి; పర స్త్రీవ్యామోహం మానవలసిందిగా చెప్పిన గుణపాఠం హృద్గతం; యిప్పటికీ హృదయాంతరాళములో సుళ్లు తిరుగుతూనేయుంది.

"క్షమించు!" అనలేక అన్నాను.

# సంపూర్ణజీవనానికి సాధనములు

## ప్రార్థన

మానవ శరీర పోషణకు ఆహార మెంత అవసరమో, మానవ మానసిక పోషణకు ప్రార్థన అంత అవసరము. దైవప్రార్థన జీవమునకు ఊటనీరు. కష్టపడి, పనిచేసి అలసిపోయినవారికి కొన్ని నిముషములు తదేక చింతతో దేవుని ధ్యానించిన, ఆ బలహీనత అలసటపోయి, ఉత్సాహము, మనోవికాసము కలుగుతవి.

ఎన్నియో ఆలోచనలతో కూడుకొని, ఒకటిన్ని స్థిరపడక, తల్లడిల్లే మనసు కాసేపు అన్నింటిని విడిచేసి, తదేక ధ్యానంతో ప్రార్థన చేసినయెడల మనస్థిమితము, శాంతి, అభిప్రాయ స్థిరము కలుగును. దిగులు, భయము, దుఃఖము చెందిన మనసుకు నమ్మిక, విశ్వాసము, దుఃఖోపశమనము, కలుగును.

కోపము వచ్చిన కాసేపు ధ్యానించిన శాంతము నిచ్చును. వ్యాధితో బాధపడే వారికి ప్రార్థన ఒక జీవజలఊటే. మనో వికాసం, బాధోపశమనం, ఓర్పు కలుగ చేయును. ఒకరికనట మెందుకు, సర్వ జనులకు ప్రార్థన అత్యవసరము.

మన హిందువులలో ప్రస్తుతము దైవ ప్రార్థన చేయటం కరువై పోయినది. క్రీస్తులు, తురకలు ఎంతయో మేలనిపించుచున్నారు. చిన్నబిడ్డలకు ప్రతిరోజు పడుకొనుటకు ముందు దేవుని ప్రార్థించడం నేర్పెదరు. చాలమంది ఆదివారం తప్పక (చర్చికి) వారి దేవాలయమునకు వెళ్లెదరు. తురకలు వారి ఆచారములను వదలక చాలమంది అనుష్ఠించుచున్నారు. హిందువులే అన్నియు మానేయుచున్నారు. ఎక్కడో కొందరు గాని, మిగిలినవారందరు సంధ్యావందనము అసలు చేయడము లేదు. దేవుడిగుడికి పోవడం అనాగరీకము. నోములు, వ్రతములు అన్నీ అడుగంటుచున్నవి. పోనీ ఇవన్నీ మాని, మానసిక పూజలోనికి దిగినారనుటకును వీలులేకుండా నున్నది. ప్రార్థనాపరులు చాలా అరుదుగా నున్నారు.

ప్రపంచ వ్యవహారమంతయు ముగిసిన తరువాత, ఏఅఱువైఏండ్లకో, ఏడెబ్బైఏండ్లకో ఏచింతా లేకుండా ఒకమూల తీరికగా కూర్చొని, జపమో, తపమో చేసుకో వచ్చు ననుకుంటారు. మొట్టమొదట అన్నేళ్లు బ్రతికి యుంటామనుట కేమి నమ్మకం. అప్పుడుమాత్రము బుద్ధినిలకడ ఎక్కడనుండి వస్తుంది. ముక్కుమూసుకొని, మూలకూర్చున్న మనసు ప్రపంచ వ్యవహారాలతో, పీక్కుంటూనే యుండ వచ్చును. మొక్కయి వంగనిది, మానయి వంగుతుందా!

ఈ ధ్యానం అనేదే తపస్సు. ఇదే జపం, ఇదే యోగం. నిర్మానుష్యమైన అడవి లోకిపోయి, చెట్టుక్రింద కూర్చొని, తపస్సు చేయ నక్కరలేదు. ఈ సంసారములో నుండియే, అన్నిపనులు చేయుచునే, ప్రతి నిత్యము కొంతకాలము ప్రార్థనకని నిర్ణయించుకొని, ప్రార్థించవచ్చును. మొదట ఈవిధముగ చేసిన, పోను పోను, మన మేపని చేయుచున్నను, సదా సర్వకాలము మనసు దేవునియందే లగ్నమయి యుండును.

ప్రార్థన యనగా దేవుని ఆత్మ శ్వాసించుట యని అర్థము. ప్రార్థించువారిలోనికి, ఆయన పరిశుద్ధాత్మను ఊదినప్పుడే వారు జీవాత్ము లగుదురు. నూతన మైనట్టియు, ఆరోగ్య కరమైనట్టియు, నిత్యజీవము కలిగించును గనుక వారెన్నటికి చావరందురు.

ఈలోకము అనేకులు మునిగి నశించే మహా సముద్రమువలె నున్నది. కాని చేపలు లోతైన నీళ్లలోకూడ జీవముతోనే నుండును. ఎందుకనగా, అవిపైకివచ్చి, తమ నోళ్లను తెఱచి కొంతగాలిని పీల్చుకొనుచుండును. ఆగాలి వాటినిపట్టి దేహములో నున్నందువల్ల, లోతునీటిలో కూడ అవిబ్రతికేవుండగలుగుచున్నవి. అటులనే ఈబ్రతుకనెడి సముద్రము పైకివచ్చి, ప్రార్థన ద్వారా ఏకాంతమందు, పరిశుద్ధాత్మయైనట్టి, పవిత్రమైన గాలిని సంపాదించువారు ఈలోకమను సముద్రములో నశించక, జీవముకలవారై సంతోషముగ నుందురు.

ఓడనీటిలోనుండుట మంచిదేకాని, ఆవోడలో నీరునిండిన అది నాశనమైపోవును. అలాగే మనుష్యుడు లోకములో, సంసారములో నుండుటసరియే, అది వానికితగినదే, ఎందుకనగా వాడు ఈవిధముగా పైకి తేలియుండి, ఇతరులను తమజీవిత గమ్యస్థానమునకు చేర్చుటకు వారికి సహాయము చేయుచుండవలెను. కాని లోకము వానిలో ప్రవేసించిన, అనగా వాని హృదయములో ప్రవేసించిన, వానికే నాశనము కలుగును.

నీళ్లులేకుండ జీవించుట అసాధ్యము, కాని దానిలో మునిగిపోయిన ఊపిరిసలుపక చత్తురు. అటువలెనే ఈలోకమును, లోకములోని వాటిని సరియైన ప్రకారము వాడుకొనుట అవసరము. అవిలేకుండ జీవించుట కష్టము. దేవుడు లోకమును మనుష్యుని కొఱకే సృష్టించెను. కాని దానిలో మునిగిపోవుట అవసరములేదు. తామరాకుపై నీటివలె, ఈలోకపువాడైనా, ఈలోకపువాడు కాడన్నట్లుగా, లోకపు వ్యవహారములంటక జీవించవలెను.

బిడ్డ తల్లినికూర్చిగాని, పాలనుకూర్చిగాని గ్రహించి, పాలుఎట్లుకుడువవలెనో, మొదట నేర్చుకొనుట ఎంతమాత్రము అవసరము లేదు. ఏనేర్పు బోధలేకుండనే, స్వాభావికముగా పాలు కుడుచుపద్ధతి, బిడ్డకు తెలి

యును. అలాగే, ఆత్మీయముగ పుట్టిన వారికి, ఈలోకపు చదువు, తత్వశాస్త్రము, మొదలైనవే బోధలేకనే, తామెట్లు ప్రార్థింప వలెనో ఆత్మీయతల్లియైన ఆపరమేశ్వరి, పరాశక్తినుండి, నిత్యజీవపుపాలు ఎట్లుపొంద వలెనో యెరిగియుందురు.

దేవుడు మనుజుని స్వాభావికమైన ఆకలి దప్పులలో సృజించెను, గనుక, వాడు తానే దేవుడునని, భయములేకుండ అనుకొనలేడు. మఱియు ప్రతిదినము వాని ప్రాణమువానిని సృజించిన మరియొకని ప్రాణము మీదనే ఆనుకొనియున్నది. తనకున్న అక్కఱలను బట్టి వాడు గ్రహింప వలసియున్నది. ఈవిధముగ మనుష్యుడు తనకొఱతను, అక్కఱను గ్రహించి విశ్వాసము, ప్రార్థన, ఆత్మీయ జీవముద్వారా దేవునియందు వాడును, వానియందు దేవుడును, వసించిన యెడల, ఆనందమును, సంతోషమును కల వాడై యుండును.

ప్రార్థించుట యనగా దేవునితో సంభాషించుట, దేవునితో అన్యోన్య సహవాసముకలిగి జీవించుట, దేవునితో వసించుట, దేవునివలె అగుట.

అడవి మృగములను, మెఱుపుసారమును, వెలుగును, వాయువును, ప్రకృతిలోని ఇతర భూతములను, స్వాధీన పఱచుకొని, వానిని ఉపయోగ పఱచుకొనుట ఏమంత గొప్ప సంగతికాదు గాని, ఘోరపిశాచమైన, ఈమనసుయొక్క దుర్బుద్ధిని, దురేచ్ఛలను, స్వాధీనపఱచుకొని, వానినణచుట నిశ్చయముగా బహుగొప్ప సంగతి.

వృత్తగా కొంగజెపమువలె, తమపెదవులతో మాత్రమె స్తుతించి, ఆరాధించెడి వారికిని, తమ హృదయముతోను, ఆత్మతోను ఆరాధించెడి వారికిని, ఎంతయో భేధము వున్నది.

మనుష్యునికి సాధ్యమైన సంగతులు ప్రార్థనద్వారా, సాధ్యమగును. గనుక ప్రార్థనాపరులు, యోగులు, ఈలోకపు తత్వశాస్త్రజ్ఞులు, ప్రకృతి చట్టములకు విరుద్ధమని, చెప్పెడి అద్భుతములు తమజీవితములో నెన్నియో కనుగొనుచుందురు.

నెమలి చంద్రమతీదేవి

---

# బిల్వ, వేప






## బూడుగుమ్మడి మురబ్బ

బూడుగుమ్మడి (పెద్దగుమ్మడి) ¼ వీశ, పంచదార ¼ వీశ తీసివుంచవలెను. పెద్దగుమ్మడితోలు విడిపించి, పులుసు దబ్బలవలె, పెద్దగాతరిగి తెల్లని వస్త్రముమీద ఆరవేయావలెను. కొంతసేపు ఆరిన తర్వాత తగినంత కంచుపాత్రలో ¼ అశాకు నీళ్ళు, వుంచుకొన్న పంచదారవేసి గరిటతో కలియపెట్టవలెను. బాగా పాకం అయ్యేవరకు వుడికించుకోవలెను. ఆ తర్వాత తరిగివుంచిన గుమ్మడి దబ్బలను జీరాలో వేయవలెను. ½ గంట చక్కగా వుడికిన తర్వాత గుమ్మడి దబ్బలు చిన్నగా రబ్బర్ వలె అగును. అప్పుడు ¼ తులం కుంకుమపువ్వు, (కేసరి) 2 చంచాలు పాలువేసి మెత్తగా నూరి వుడుకుచున్న పాకములో వేయువలెను. బాగా సువాసన వచ్చువరకు వుడికించి ½ చంచ ఏలకపొడి వేసి కలిపితీసి వుంచవలెను. ఇవి గోధుమ రొట్టెలు, పూరి మొదలగు వానికి నంజుడుగా వుపయోగించవచ్చును. ఇవి దేహమునకు చాలాపుష్టికరము. ఇదేమాదిరి దోరమామిడిపండుతో కూడా, చేసుకొనవచ్చును. ఇవి చాలా బాగుండును.

## గోరుచిక్కుడుకాయ పచ్చడి

గోరు చిక్కుడు కాయలు లేతవి 5 పలములు, పచ్చి మిరపకాయలు 2½ పలం, కలియ వుడికించి నీరు వడియు పాత్రలో వేయవలెను. నీరు బాగా వడిసిన తర్వాత ½ పలం చింతపండు, తగినంత వుప్పు, ½ చంచా పసుపుపొడి, కందిగింజంత ఇంగువ ఇవన్నీ రోటవేసి చక్కగా కలియ దంచుకొనవలయును. లేక మెత్తగా రుబ్బివుంచుకొన్ననూ సరి. ఆ తర్వాత, తగినంత బాణలిలో 2½ పలం మంచినూనె (నువ్వులనూనె) వేసి 1 చంచఆవాలు, పిడికెడు వుద్దిపప్పు వేసి ఎఱ్ఱగా వేగిన తర్వాత రుబ్బివుంచిన చిక్కుడు పచ్చడిని వేసి గరిటతో కలియపెట్టి 5 నిమిషములు, వుడికిన తర్వాత తీసి ఉపయోగించవలెను. 20 రోజులవరకు చెడిపోకుండును; రుచికరము, కర్చుతక్కువ.

## పుదీన చట్నిపొడి

½ అశాకు శనగపప్పు, ½ అశాకు వుద్దిపప్పు, ఎఱ్ఱగా వేయించి తీసి మెత్తగా విసిరి వుంచుకోవలెను. పుదీన కట్టలు 4 నీళ్లలో కడిగి శుభ్రపరిచి, ఈనలు లేకుండ విడిపించి వుంచవలెను. ఎండుకొబ్బర, కోరివుంచవలెను. పెద్ద బాణలిలో 5 తులములు మంచినూనె వేసి కాగిన తర్వాత ఒక చంచా ఆవాలువేసి చిటపట అనగానే, 5 పలములు ఎండు మిరపకాయలు వేసి ఎఱ్ఱగా వేయించి తీసుకోవలెను. తర్వాత శుభ్రపరచిన పుదీన ఆకును కాగుచున్న నూనెలో వేసి, బాగా వేయించుకోవలెను. ఆ తర్వాత, వేగివున్న ఎండు మిరపకాయలు, తగినంతఉప్పు ½ తులం చింతపండు, రోటవేసి మెత్తగాదంచుకోవలెను. ఆ తర్వాత విసిరి వుంచుకొన్న పిండిని పుదీనఆకు, ఒక ఎండుకొబ్బర కోరువేసి కలిపి, బాగా కలియదంచి తీసి వుపయోగించవలెను. ఇవి చాలాబాగుండును. వంటికి ఆరోగ్యమును చేకూరును. అజీర్ణము, కడుపులో తిప్పట, వాంతి ఇలాంటి వారికి చాలావుపయోగము. చాలాళ్లు వాడితే పైనచెప్పిన వ్యాధులు హరించి ఆరోగ్యమును చేకూరును.

యమ్. ఆర్. సీతమ్మ

# మురళి

మోదుకూరి వెంకటరత్నం

అది ప్రశాంత వనవాటిక. ప్రశాంత స్వరూపుడైన స్వామి పడమటి దిశన వాలుతున్న సూర్యుని చూస్తున్నాడు. ఆవాతావరణాన్ని భిన్నంచేస్తూ ఒక రాజకుమారుడు చేరాడు. అతడు యువకుడు. నడకలోని గాంభీర్యం ముఖంలోని వర్చస్సు ఘనమైన వంశ గౌరవాన్ని చాటుతున్నాయి. అలసి చేరాడు ఆవనిముఖంలో వ్యథా కథనం కదను త్రొక్కుతున్నది.

ఋషి తన నిమీలిత నేత్రాల నెత్తి చూచి చిరునవ్వుతో నాహ్వానించాడు. రాకుమారుడాయన పాదాలదగ్గర కూర్చున్నాడు.

"వేటలో మార్గంతప్పవా! నాయినా" ఋషి వాత్సల్యంతో ప్రశ్నించాడు.

"కాదు ప్రభూ! సంఘ నియమాలచే వేటాడబడి పరుగిడి చేరిన నిర్భాగ్యుడను. ఇట్టి ప్రశాంతత కోసమై తహ తహలాడుతున్నాను. నన్ను మీశిష్యుడిగా నను గ్రహించండి స్వామీ?" దీనంగా ప్రార్థించాడు యువకుడు.

"భగవంతుడలా నిర్ణయిస్తే నలాగే జరుగుతుంది. నీచరిత్ర తెలియజెప్పుము వత్సా!"

యువకుడు క్షణకాలం తటపటాయించినాడు. ఋషి వెన్నెలలవలె నవ్వాడు.

"ప్రభూ-ఆకనిపించు మహానగరం పాటలీపుత్రవాసిని. పాటలీపుత్ర సార్వభౌముని గర్భాన పుట్టిన నిర్భాగ్యుడిని. మహారాజ వంశంలో పుట్టిన నేరంచేత నన్ను సంఘం ఖైదు చేయచూచింది. నాహృదయ సర్వస్వమైన ప్రేమను తృణీకరించింది నాప్రేమైక నిధాన వేశ్యకావటం నాతప్పా?"

"సరిసరి - వివరంగా తెలియ జెప్పు నాయనా!"

"గత నెలలో జరిగింది నాజన్మదినోత్సవం. తత్సందర్భంలో జరిగిన సభకు రాజనర్తకి తనకుమారిని మొదటిసారి సభకు బహూకరించింది. సభలో నామె నృత్యం సభాసదుల హృదయాలను గంతు లేయించింది. ఆమె కనుగొన చూపు తూపులు నాహృదయాన్ని చేగొన్నాయి. నేనామెను ప్రేమించాను నాట్యాంతన నాపాదాలు వేదికదిగి యామె మెడలో నారత్నహారాన్ని వేయచేశాయి. ఆమె కృతజ్ఞత శిరమునెత్తి నాకనులవైపు చూచాయి. ఈలోకాన్నే మరిచి నేనామె హృదయాన్ని చూచాను. సభికులలో గుస గుస లారంభ మయాయి.. మహారాజు దర్బారును ముగించారు.

ఆరాత్రి మహారాణి ప్రధానియొకరి తరువాత నొకరు నాచేష్టను ఖండించారు. నానిశ్చయ ప్రేమను వారికి ప్రకటించాను. మరునాడు నాస్నేహితుని పంపాను వారి

యునికి తెలుసుకుందికి ... కాని, రాజ భటులు వారిని పురంనుండి బహిష్కృతులను చేశారు ... ఈకఠోర శాసనం భరించ లేకపోయాను. రెండు లేత హృదయాలు కలియడమే నేరమా? నాటినుండి వెదకి వేసారాను. నాకోరకై రాజభటులు తిరుగుతున్నారు. సన్యాసిగా నయిన నన్ను వారు తలపరు నాకు సన్యాస మీయండి ప్రభూ.'

ఋషి పెద్దపెట్టున నవ్వ నారంభించాడు.

"వెఱ్ఱినాయినా ఇంత మాత్రానికేనా?"

"నిరాశాహతునికి మార్గాంతమేమి తండ్రీ"

"నిరాశనుండి నీవా శాపథంలో నడుగిడినా సన్యాసివయి సన్యాసి కర్మలనుండి విడువడి యాశ్రమాన్ని భగ్నం చేస్తావా?" ఋషి ప్రశ్నించెను.

"ఆశకవకాశం లేదు ఋషీ."

"ఆలోచించు అనాలోచిత మెల్లప్పుడు ప్రమాదభూతం" అని,

"తల్లీ సులలిసీ. యీయతిదికి పానీయ మీయమ్మా" అని పిలచాడు.

లోనుండి సౌందర్య ఖనియైన పదహారేండ్ల కన్య వెలిజేరింది. రాజకుమారుడామెవైపు చూచాడు. నిర్ఘాంతుడైచూచి లేచినిలబడ్డాడు. ఆమె చేతిలోని చెంబు చేయజారింది. మెరపువలె మెరసి కుటీరం లోకి తిరిగి చేరింది.

రాజకుమారుడు నిశ్చేష్టత నుండి మేల్కొని ఋషిపాదలపైబడి మ్రొక్కాడు.

"స్వామీ.. యీమె...?" ప్రశ్నార్థకంగా గద్గదిక కంఠంతో చూచాడు.

"అవును ... రాజనర్తకి కుమారి ... మురు. భరతనాట్య శిష్యురాలు రాజశాసనానికి వెరచి నాయాశ్రయంలో చేరింది."

మరునాడు వనవాటికలో వివాహం జరిగింది. తరు తరుణీలలామలు తమ శాఖాకరములకు సుమాక్షతలు జల్లాయి. వారి గర్భముక్తాఫలమే చంద్రగుప్తుడు. చాణక్య ప్రియశిష్యుడు.

# సామెతలు

శ్రీమతి కె. పద్మావతిదేవిగారు



1. కడుపు కూటికి ఏడిస్తే కొప్పు పూలకు ఏడ్చినది.
2. కంచము అమ్మి మెట్టెలు కొన్నట్లు.
3. కండ్లు అర్చినమ్మ ఇండ్లు ఆర్చును.
4. కట్టెవంక పొయ్యి తీరుస్తుంది.
5. కడవంత గుమ్మడికాయ అయినా కత్తి పీటకు లోకువే.
6. కాచిన చెట్టుకు రాళ్ళదెబ్బలు.
7. కాలీకాలని మొండికట్టె.
8. కాళ్లకు చుట్టుకొన్నపాము కరువక మానునా !
9. కాశికివెళ్ళి గాడిదగుడ్డు తెచ్చినట్లు
10. కానుగొడ్డుకు రూకబందె.
11. కీడెంచి మేలెంచవలెను.
12. కుక్క కాటుకు చెప్పుదెబ్బమందు.
13. కుక్కకు వచ్చునవన్ని గొగ్గిపండ్లే.
14. కూటికి పేద అయితే కులానికిపేదా ?
15. కూతలార్భటాలేకాని కుప్పలో గింజలు లేవు.
16. కొండనుత్రవ్వి ఎలుకను పట్టినట్లు.
17. కొండ మ్రింగువానికి గోపురము అడ్డమా.
18. కోటి విద్యలు కూటికొఱకే.
19. కోడలు నలుపయితే కులమంతా నలుపే.
20. క్రొత్త అప్పుకుపోతే పాత అప్పు బయట పడినది.
21. క్రొత్త బిచ్చగాడు ప్రొద్దెరుగడు.
22. అంగటిలో అన్నీ యున్నవి అల్లునినోట శనియున్నది.
23. అంగటిలో బెల్లము గుళ్ళో లింగానికి నైవేద్యం.
24. అంగిట విషము, నాలిక తియ్యదనము.
25. అంతమాత్రమువుంటే దొంతులలో కాపు
" రము చెయనా.
26. అంత్యనిష్ఠురముకన్నా ఆదినిష్ఠురమే మేలు.
27. అందనిపూలు దేవుని కర్పణ.
28. అందరికి నేను లోకువ నాకు నంబిరామాయ లోకువ.
29. అత్త చేసిన పనికి అరళ్లులేవు.
30. అత్తలేని కోడలు ఉత్తమురాలు, కోడలులేని అత్త గుణవంతురాలు.
31. అత్త ఒకరింటి కోడలే.
32. అదిగో అంటే ఆరునెలలు.
33. అన్నీ చోరవేకాని అక్షరచోరవలేదు.
34. అని అనిపించుకోవలెనా అత్తగారు.
35. అప్పు దొరికితే పప్పుకూడు.
36. అబ్బిగాడు చస్తే ఆ పంచనాది.
37. అమ్మతాను పెట్టదు అడుక్కొని తిననివ్వదు.
38. అమ్మబోతే అడవి కొనబోతే కొరివి.
39. అయితే ఆదివారం కాకుంటే సోమవారం.
40. అయ్యకు విద్యాలేదు అమ్మకు గర్వము లేదు.
41. అరచే కుక్క కరవనేరదు.
42. అరటిపండువలచి చేతిలోపెట్టినట్లు.
43. అర్థము ప్రాణము ఆచార్యాధీనము.
44. అతిరహాస్యం బట్టబయలు.
45. అసలు సోమిదేవమ్మ, అందులో వేవిళ్లు.
46. అవ్వను పట్టుకొని వసంతమాడినట్లు.
47. ఆ అంటే అపశబ్దము నారాయణా అంటే బూతుమాట.

48. ఆడపెత్తనం తంబళ దొరతనం.
49. ఆర్చేవారే కాని తీర్చేవారులేరు.
50. ఆవగింజ పందువుంటే అప్పుడే అరవై గారెలు తిననూ.
51. ఆవుల మళ్లించినవాడు అర్జునుడు.
52. ఆశలేనికూటికి ఆకలిలేదు.
53. ఆడబోయిన తీర్థము ఎదురుగా వచ్చినది.
54. ఇంటికన్నా గుడి పదిలము.
55. ఇంటికి జేష్ఠాదేవి, పొరుగుకు లక్ష్మీదేవి.
56. ఇంటగెలిచి రచ్చగెలువవలెను.
57. ఇంట్లో ఈగలమోత బయట పల్లకీమోత.
58. ఇల్లు ఇర్కాటం, ఆలు మర్కాటం.
59. ఇచ్చేవాణ్ణిచూస్తే చచ్చేవాడయినా లేచును.
60. ఇస్తే పెండ్లి, యివ్వకపోతే శార్ధము.
61. ఇల్లెక్కి కొరివి త్రిప్పినట్లు.
62. ఈదబోతే త్రాగ నీళ్లులేవు.
63. ఈతకు మించిన లోతులేదు.
64. ఈవూరి కావూరెంతో ఆవూరి కీవూరంతే.
65. ఉట్టికి ఎక్కలేని అమ్మ స్వర్గానికి ఎక్కునా!
66. ఉత్తముండకన్నా అత్తముండమేలు.
67. ఉన్నది ఒక కూతురు వూరంతా అల్లుళ్లు.
68. ఉభయ భ్రష్టత్వం ఉపర సన్యాసం.
69. ఊరంతా చుట్టాలు వుట్టికట్ట తావులేదు.
70. ఊరిమీద వూరుపడ్డా కరణముమీద కాసు పడదు.
71. ఊరివాడికి కాటిభయం పొరుగూరివానికి నీటిభయం.
72. ఊరు వుస్తికాయంత సిద్ధాంతం తాటికాయంత.
73. ఎంచబోతే మంచమంతా కంతలే.
74. ఎత్తుపడ్డగొడ్డు పులికి జడుస్తుందా.
75. ఎనుబోతుమీద వానకురిసినట్లు.
76. ఎప్పటిమేలు అప్పటికే.
77. ఎవరబ్బ సొమ్మురా ఎక్కెక్కి ఏడ్వటానికి.
78. ఎవరికివారే యమునాతీరే.
79. ఎవరిపిచ్చివారికి ఆనందం.
80. ఎవరికొంప తీయడానికి ఈ జంగంవేషం?
81. ఎఱ్ఱనిచూపి చేపనులాగినట్లు.
82. ఎల్లిశెట్టిలెక్క యేకలెక్క.
83. ఏకులంపెట్టితే బుట్టచినగదు.
84. ఏగాలికి ఆచాపఎత్తే ఎంగిటిగాడు.
85. గంతకుతగిన బొంత.
86. గతిలేనమ్మకు గంజేపానకం.
87. గతులకుపోతే బతుకులుపోయినవి.
88. గుడిలో గంటపోతే నందికేమిలోటు.
89. గుడ్డికన్నా మెల్లమేలు.
90. గాజులబేరము భోజనానికిసరి.
91. గూనికితోడు గుఱ్ఱపువాయువు.
92. ఒక వరలో రెండు కత్తులు యిమడవు.
93. ఒక రిద్దరిని చంపితేకాని వైద్యుడుకాడు.
94. గుఱ్ఱము గుడ్డిదయినా ధాణా తక్కువలేదు.
95. చదువవేస్తే వున్నమతి పోయినది.
96. చదివేది రామాయణము పడగొట్టేది దేవ స్థలాలు.
97. చూస్తేనీది చూడకుంటేనాది.
98. జోగి జోగి రాసుకుంటే బూడిదరాలినది.
99. ఖాజీని ఫాజీగ, ఫాజీని ఖాజీగ చేస్తాడు.
100. తల్లి పుట్టిల్లు మేనమామదగ్గర పొగడినటు.
101. దాసరితప్పు దండముతోసరి.
102. నిండుకుండ తొణకదు.
103. పాముతో చెలిమి కత్తితోసాము.
104. ముక్కిడికితోడు పడిశము.
105. సాతానిజుట్టుకు సన్యాసి జంజెమునకు ముడిపెట్టినట్లు.
106. సుపుత్రః కొంపచెరపకః.
107. బిచ్చపుకూటికి శనేశ్వరము.
108. డబ్బులేనివానికి భోగముది తల్లివరుస.
109. చచ్చినవానికండ్లు చేరడేసి.
110. తనకు మించిన దానమా?




(గతసంచిక తరువాయి)

## ప్రథమాంకం — షష్ఠమరంగం

[ప్రదేశం-దుర్గాలయం, రాణి ప్రార్థించుచుండును ప్రతిమ ముందు దీపులో కరవాల ముంచబడియుండును ఆలయం నిర్మానుష్యంగా నుండును.]

వనరాజు గుహాచుట్టె వానరమూకలు
వాలాలు త్రుంచంగ వరమునిమ్మా!
తల్లిదేశానికి తనయనై నేనుంటి
దేశద్రోహులగొట్ట తెగువనిమ్మా!
స్వాతంత్ర్య జ్యోతుల చల్లార్చుజాతిని
చెండాడ సింహాల జేర్చనమ్మా!
విడవడ్డ తంతువుల్ వీణను చేకూర్చి
సమరగీతంబుల చదువుదమ్మా!
కత్తిచేబట్టి శాత్రవ కత్తికెదుర
కదనభూమిని విహరించ కరుణనిమ్మా!
పొమ్మా రణభూమికని నన్ను ప్రోత్సహించు!
అమ్మ దుర్గాంబ నినునమ్మితమ్మా! నిజము!!

[ప్రార్థన సమాప్తంకాగానే కరవాలం చేబట్టును. అంతలోకి కిరణ్ ప్రవేశించును]

కిరణ్:-శుభవార్త సోదరీ సేనాధ్యక్షుడు కాలేఖాన్ కలసుకోవాలని వచ్చాడు. ఆంగ్లేయ పాలనకు వ్యతిరేకంగా దేశంలో విప్లవం ప్రారంభమైందనీ విప్లవవాదులంతా ఆంగ్లేయులను దేశం నుంచి బయటకు తరమడాని కుమ్మక్కులై వున్నారనీ చెప్పడతను.

రాణి:-నాకూ అదే విశ్వాసం; కిరణ్ తల్లి.... శక్తియొక్క వరదానమది. మంచి రోజులు తిరిగినై. అంధకార బంధురమైన నిశీథానంతరం, శుభప్రభాతాగమనం సహజమేగద. సేనానాయకు డేడీ?

కిరణ్:-బయటనిలబడి యున్నాడు. పిల్చేదా?

రాణి:-మంచిది, మంచిది; నేనే బయట కొస్తున్నా. యెట్టి సంఘటనా వార్తలు వినాలనో. తల్లి శక్తి! నీ అభయదానం అమర సత్యముగుగాక.

(సేనాపతి ప్రవేశం)

కాలేఖాన్: ఝాన్సీకి జై.

రాణి:-విషయాలేమో వివరించుము సేనాపతీ?

కాలేఖాన్:-విషయాలు వినదగినట్టివీ, వుద్రేక పూరితమైనట్టివీ ... వుత్తమమైు

నట్టివీని; రాణీగారు. ఐరోపా దేశస్థులగు ఆంగ్లేయుల కంత్యకాలమాసన్నమైనట్లుంది. మన సౌభాగ్యసాధకవాటములు, సవినయముగా సౌధాంతర్భాగమున కాహ్వానిస్తున్నట్లున్నై. దేశమందంతటా, మాయామోసమూ - దగాలే స్వభావమైనట్టి ఆంగ్లేయులకు విరుద్ధంగా విప్లవాగ్ని భగ్గుమన్నది. బెంగాల్, కాన్పూర్, మీరట్, ఢిల్లీ - మొదలగు పట్టణములందు తెల్లోళ్ల జోగమంటలు ప్రజ్వరిల్లుతున్నై. ఝాన్సీయెడ వారు తలపెట్టిన ద్రోహానికి ప్రతీకార మొనర్చుట కిదే మంచి సమయం. ఝాన్సీలోకూడా విప్లవాగ్ని కాముకుతున్నది-ఒక్కసారి భగ్గుమంటుంది. శత్రుసౌధాలు శిథిలమైపోతై. మీఆజ్ఞ అందుటే ఆలస్యమికను. తెల్లోళ్లను గడ్డిలాగా తరిగి పారేస్తాం. రక్తం పొంగులెత్తుతోంది.

రాణి:-స్వాతంత్ర్యంకొరకు రక్తం వేడెక్కవలసిందే సేనాపతి! స్వతంత్ర సంచలనంలేని రక్తము రక్తమేగాదు... నీరు. మీరు చెప్పుచున్నట్టి తుఫాను యెక్కువరోజులు నిలబడుతుందో లేదో అన్న విషయంకూడా బాగా ఆలోచించాలి. అది చాలా అవసరం. నీటిని పాలనుకొని త్రాగితే మాత్రం అవి పాలగునా? నేడు భగ్గుమన్న యగ్గి రేపట చల్లబడదని యెవరు చెప్పగలరు? మీరు అమృతమనుకొని త్రాగబోయేది విషమగునని యెవరికి తెల్సు? కాబట్టి విప్లవసముద్రమున దిగబోయే ముందు, అందు నీరెంతవున్నదో చూడడం అత్యవసరం. ప్రవాహ మెలా వుందో పరికించడం ప్రధాన విషయం.

కాలేఖాన్:-తమరు సెలవిచ్చునది సత్యం రాణీజీ! కాని, కూనత్తు దేశీయ సైన్యము, ఒక ప్రక్కకొరిగి విజయ పరంపరల పురోగమిస్తున్నట్టు మనకు స్పష్టమైనా, ఇంకా తెల్లోళ్లు మనల నెదిరించే దంటిమన్ను? మెదలకండా కూర్చున్న మనకింత సావకాశం లభించి నప్పుడూరుకోవడం దేనికి? అన్నియును, ఆలోచించే చేయబడవు. యీ తిరుగుబాటుతో, ఆంగ్లేయులను బయటకు గొట్టి మిమ్ము - మామహారాణిగా జేసుకోవడమే నా కోర్కె. మనలను కోట బయటకు గొట్టి, ఆంగ్లేయులు, దర్బారు ఆభూషణములు హస్తంగత మొనర్చుకున్ననాటి విషయం మరువలేదు, మరువజాలను. హిందూ మహమ్మదీయ సైనికులెల్లగూ సిద్ధమైయున్నారు. యీ స్వతంత్ర సంగ్రామ రంగమున, తమరు మాకాదర్శ మార్గగాములై నిలబడవలెనన్నదే మాకోర్కె. ఝాన్సీరాజ్యం మనది గావాలనీ, అందు మనవిజయ పతాకం యెగరాలన్నదే మాయాశయం.

రాణి:-స్వతంత్ర సంగ్రామమున పాల్గొనడమనే విషయం, ప్రతిభారతీయునకూ గౌరవాన్వితమైనట్టిదే సేనాపతీ! కాని, నాకు కొంచెం ... అంటే జయాపజయముల విషయమైగాదు. యోధులైనవారికి జయాపజయములు సమమే. ఆంగ్లేయులశక్తి అజేయమైనట్టిదన్న భయంకూడా నాకులేదు. కత్తిబలమున ఆంగ్లేయులు భారతదేశములో యెక్కువకాలముండజాలరన్న విషయం నాకు తెల్సు. వారేకాదు, యేప్రభుత్వమూ ఆయుధబలమున యెక్కువకాలం మనలేదు. కాని చిక్కిన సావకాశాన్ని గురించి కాస్త ఆలోచించుకోవాలి.

కిరణ్:-పరిస్థితులింత అనుకూలంగా వున్నప్పుడు మీరెందు కంగీకరించరు సోదరీ? ఇట్టి సావకాశం అనుకున్నప్పుడల్లా అందుతుందా? రాణిని దాసిగా మార్చాలనుకున్న మోసగాళ్లను గురించి, ఇంకా ఆలోచించేదేమిటి? ప్రతీకార మొనర్చుటే ప్రథమ కర్తవ్యమై వుండాలి.

రాణి:-మీరు చెప్పేది నిజమే. కాని ఆలోచించుకోవాలనుకుంటున్నా. అందు కెప్పుడూ వెనుకాడను. యీ తెల్లోళ్లు మనకొనర్చిన వుపకార మెలామరవగలను? రాజును జోగిని, జోగిని రాజును చేసిన-వీళ్ల వుపకారానికి ఫలితం వీళ్లకు ముట్టజెప్పకుండా వుండేదెలాగసలు? కాని మార్గమేదో చూడాలిగా, గనుక మీరు వెళ్లండి సేనాపతీ! రెండు మూడు రోజుల్లో కబురుచేస్తాను.

కాలేఖాన్:-చిత్తం! కాని మా మనవి మన్నించ్చెదరుగాక. ఝాన్సీకీ జై!

[వెళ్లును]

రాణి:-కిరణ్! బహుశా ఝాన్సీచరిత్ర మారబోతున్నట్లున్నది. యేంజరుగనున్నదో నీవు చెప్పగలవా?

కిరణ్:-నాబుర్రకు బూజు పట్టింది. మీరేం జేస్తారో ... మరి యేంజరుగనున్నదో కూడా నాకంతుబట్టడంలేదు. కాని, సేనాపతి జెప్పిన విషయం మీరెందు కంగీకరించలేదు? సేనాపతి మనమేలు కోరేగదా చెప్పినది?

రాణి:-నీవర్థం జేసుకోలేదు. యిది సిపాయి తిరుగుబాటు విషయం. వేడెక్కడమూ తొందరే, చల్లబడ్డమూ తొందరే. వాస్తవంగా వారిలో సాహసమనేదుంటే రాణి నాయకత్వం వహిస్తుంది. అలాగాక, తదితరంగావుంటే, ఆ పరిస్థితుల్లో కిబోవడ మేమంత మంచిది? లాభ మేముంటుంది? సరేనసీ, ముందు నాన్నగారితోకూడా ఒక పర్యాయం ఆలోచించడం మంచిది పద.

దాసీ:-(ప్రవేశించి) దివాన్‌గారితో మేజర్ ఎలిస్‌గారొచ్చివున్నారు వీరు ...

రాణి:-ఇచ్చటికా ?

దాసీ:-చాలా అవసరమైనపని వున్నదంటున్నారు. అడ్డగిస్తే వారేమన్నారంటే-ఇక్కడ్నే మందిరంలోనే, మాట్లాడతామన్నారు.

కిరణ్:-వీల్లేదని చెప్పు. మందిరంలో దేవీపూజ జరుగుతోంది - మోసగాండ్రతోనూ, దోపిడిగాండ్రతోనూ మాట్లాడజాలరని చెప్పుము.

రాణి:-కాదుకిరణ్, అలా చేయరాదు. మనతో మాట్లాడాలని వచ్చినవారు స్నేహితులైనా, శత్రువులైనా-మనమొక విధముగనే చూడాలి. ఇల్లేమిటి .... మందిరమేమిటి... అతిథులకన్నీ వొకటే అనుకోవాలి. యేపరిస్థితుల్లో వారొచ్చారో యేమెరుక ? (దాసీతో) వెళ్లు. లోనికి రమ్మనిచెప్పు.

[ఇరువురూ ప్రవేశింతురు]

(సశేషము)

# అభిప్రాయాలు

శ్రీ పులిపాక బాలాత్రిపురసుందరమ్మగారు

(గతసంచిక తరువాయి)

## 3

శ్రీ సమాజానికి ఇన్‌స్పెక్టరుగారి భార్య ఇందిర కార్యదర్శి. మధ్యాహ్నం మూడుగంటలైంది. యిందిర తలదువ్వుకుని, సమాజానికి వెళ్లటానికి సిద్ధపడి, తన స్నేహితురాండ్రకోసం ఎదురుచూస్తున్నది. కొంతసేపు చూసి, జవాన్ను పంపింది వాళ్లకోసం. వెంటనే వచ్చింది సుశీల.

"యేమోయి ఇందిరా! యెందుకు? అర్జంటుగా కబురు పంపావు?"

"యెందుకేమిటి? ఇవాళ మహాత్మ జయంతి గాదు?"

"నాకు నోటీసు రాలేదేం?"

"రాకపోవడమేమిటి? యిదుగో పుస్తకం నీ సంతకం చూసుకో."

"ఇది మావారి సంతకమోయ్. అచ్చంగా నాలాగే రెండు పొడక్షరాలు పెడతారు. యం. యస్. అని. నేను మళ్లీ అడిగితే, ఎవరైతేయేం మన మిద్దరం ఒకటేకదూ? అంటారు. మనం యెన్నైనా విషయం నాకు తెలియాలికదా? అంటే. నీస్నేహితులు నీకు కబురు చెయ్యరా? నీవు వెళ్లవా? అప్పుడు నిన్ను పిలిస్తే, దాంతో ఒక గంట కబుర్లు కొట్లాడుతూ, వంటాలస్యం చేస్తావు. నాకు ఆఫీసుటైమౌతుంది. అని కిసుక్కున నవ్వుతారు. వారు వాకిట్లో ఉన్న రోజు నోటీసువస్తె యెప్పుడు ఇంతేనోయి. ఇందిరా! ఇంకా సీతకూడరాలేదే"?

"ఆవిడకూ తెలియదేమో, కృష్ణజయంతి నాడు ఆవిడ ఇల్లాగే మొత్తుకుంది. వాళ్లపిల్లలెవరో ఒకరు సంతకం పెట్టి పంపుతారట. ఆవిడకు ఒకప్పుడు చెపుతారు ఒకప్పుడు చెప్పరట. నీవువెళ్లి చెప్పన సిద్ధపడిరా. ఇంతలో వస్తేవస్తుంది. రాకపోతే దారేగా వెళ్లుతూ మనం కేక వేద్దాం."

"ఓహో శ్రీలక్ష్మీ: యెప్పుడొచ్చావు? అత్తవారింటినుంచి. మీ బామ్మకూడా వచ్చిందే. కూర్చోండి బామ్మగారు! అని పీటవేసింది ఇందిర."

"ఆ. నాతో వచ్చిందిగాని ఆవిడకేంతెలియదండి."

"నీకు మాత్రంతెలుసు కాబోలు" అన్నది యిందిర ముసలావిడ పక్షంగా.

"అది కాదండి అత్తయ్యగారు. మా బామ్మ పురాణానికి వెళ్లుతుందా - రాంగానే మానాన్నగారు, మేముఅంతా అక్కడ యేంచెప్పారు బామ్మ అని అడిగితే? భాగవతం చెప్పారు. ఆ సీతవనవాసం వింటుంటే దుఃఖంవస్తుందిరా నాయనా అంటుంది. మేమంతా విరగబడి నవ్వుతాం. సినిమాకు వెళ్లినా అంతేనండి. బామ్మ ఏంచూస్తున్నావే అంటే ఏవో బొమ్మలు చూస్తున్నానమ్మా అంటుంది. యేమే బామ్మ! నిజమేనా అని ఆముసలామె వంక చూసి, విరగబడినవ్వి, యివ్వాళ సమాజంలోకూడా, యేపన్నా అటలున్నాయేమోనని వచ్చిందండి అన్నది ఇందిరవంకచూసి శ్రీలక్ష్మి."

"ఓసి బడవాపిల్లా, యింకా నాకేంకావాలే నవ్వుకో" అని ఆమెకూడ నవ్వింది.

"ఇందిరా! డాక్టరుగారి తల్లికూడ సమాజానికి వస్తానని చెప్పింది మొన్న; జవాన్ను పంపుతావా" అని ఇందిరతల్లి కేకవేసింది ఇంట్లోనుంచి.

"ఇవ్వాళ వాళ్లకు నోటీసు వెళ్లింది, కోడలు చెపితే వస్తేవస్తుంది. అదిగాక ఇవ్వాళ ఆవిడకు తెలిసినవిషయాలేమి లేవు. యివ్వాళ మహాత్ముణ్ణి గురించి, దేశాన్ని గురించి ఆవిషయాలు ఆవిడకేం వచ్చుతాయి? బేబీని నేను తీసుకువెళ్ళుతున్నాను. దాయికి పాలు పట్టాను. తలుపులన్నీ తిన్నగా వేసి, తాళాలు చాకలికిచ్చి, దాయిని జవాన్ని యెత్తుగోమని, రండి కొంచం చీకటిపడేసరికి. లైటు వెలిగించి తీసుకురమ్మని చాకలికి చెప్పిరా, నేను వెళుతున్నా" అని తల్లికిచెప్పి సమాజానికి వెళ్లింది యిందిర.

౪

మధ్యాహ్నం రెండుగంటలైంది. ఇందిర తన గదిలో కూర్చుని, ఏదో వ్రాసుకుంటున్నది. ఇందిర తల్లి భోజనాలహాల్లో చిరిచాపమీద కూర్చుని, ఒత్తులు చేసుకుంటున్నది. ఇంతలో డాక్టరుగారి తల్లి అన్నపూర్ణమ్మగారువచ్చి," ఏమండి మాణిక్యమ్మగారు! ఒత్తులు ఎక్కువగా చేస్తున్నట్టు న్నారు, నోమేదన్నా తలుచుకున్నారా? అన్నది చంకలోఉన్న మనుమణ్ణి దింపుతూ.

తలయెత్తిచూచి, "ఓహో అన్నపూర్ణమ్మగారు! ఎండలో వొచ్చారే! ఏదోపనిమీద వచ్చారను కుంటాను, కూర్చోండి" అని కొంచం అవతలఉన్న పీట యివతలికి లాగింది మాణిక్యమ్మగారు.

"ఏమి పనిలేదండి ఇవ్వాళ మా అబ్బాయి ఊళ్ళోలేడు. తీరుబడిగాఉంది యింట్లో. మీ దగ్గరకొస్తే కొంచం మంచి కాలక్షేపణ జరుగుతుం దనివచ్చాను. మా కోడలు మీ అమ్మాయి యెల్లుండి కాకినాడ వెళ్తారటకదూ? మా కోడలు ఏదో వ్రాసుకుంటున్నది. ఈ పిల్లవాడు ఏదో పేచీ పెట్టుకుని తల్లిదగ్గరకెళ్ళి ఏడిపిస్తాడు ఆవిడ విసు క్కుంటుంది అందుకని వీణ్ణికూడ తీసుకొని ఇల్లా వచ్చాను."

"అవునండి మా అమ్మాయి అంటున్నది, ఎల్లుండి పన్నెండుగంటల బండికి వెళుతారటగదూ? మీ కోడలి ప్రయాణం నిజమేనా?"

"నిజమేనండి. మా అబ్బాయికికూడా ఆడ వాళ్ళ సభలు, మీటింగులు అంటే చాల ఇష్టం. అందువల్ల నాడే ముందు ప్రయాణం చేస్తాడు. అయితే మాణిక్యమ్మగారూ? ఇంతకష్టపడి ఆడ వాళ్ళంతా పనిచేసి, మీటింగులు జరిపి, స్వాతంత్ర్య మని, హక్కులని తీర్మానాలు చేస్తారుగదా ఇవి శాసనాలై అమల్లోకి వస్తాయంటారా?"

"యెందుకురావు? ఇప్పుడు జరిగే వితంతు వివాహాలు, అవి భర్త కుటుంబాల్లో వితంతువుల హక్కులు (శారదా చట్టము) మొదలైన చట్టా లన్నీ యిల్లా తీర్మానాలుచేసి అమల్లోకి వచ్చినవే గదా?"

"మాణిక్యమ్మగారు! మొన్న ఈ ఊరువచ్చి ఉపన్యాసం యిచ్చిందే విమలాదేవిగారు, ఆమె ఇంగ్లాండుకూడ వెళ్ళివచ్చిందిటకదా? పాపం ఒక్కతే వెళ్ళిందండీ! అక్కడకూడ ఈ సభలకే కద? ఆడవాళ్లు మనకంటే ఉన్నవాళ్లు ఇంత కష్ట పడుతుంటే నాబోటిదానివల్ల యేమి ఉపయోగం లేదుకదా?"

"యెందుకు ఉపయోగంలేదు? ఆ పనులు చేసే వాళ్ళకు మనం సహాయం చెయ్యటమే మనవల్ల ఉప యోగం."

"మనం యే సహాయం చేస్తున్నామండి వాళ్ళకు?"

"వాళ్లు సభలకు, సమాజాలకు వెళ్ళినప్పుడు, వాళ్ళ పిల్లలకు వేళకు పాళకు, పాలు నీళ్లు చూడటం వాళ్లు వచ్చేసరికి ఇంట్లో మనం చిర్రుబుర్రు లేకుండా యింటిపనులు నెరవేర్చుకోటం, యివ్వే వాళ్ళకు మనం చేసేసహాయం. ఆమె ఇంగ్లాండు వెళ్లిందంటే ఒక్కతే వెళ్ళదు. తగిన బందోబస్తుతోనే యింకా కొందరుకలసి వెళ్లారు. స్వరాజ్యంకోసం సత్యా గ్రహం చేసినప్పుడు ఆడవాళ్లు యెంతమంది జైళ్లకు వెళ్లారో మీకు తెలియదు. అప్పుడు మా ఇందిర కూడా జైలుకెళ్లింది. సంవత్సరం జైల్లో ఉన్నది. మా బేబి పుట్టింది జైల్లోనే. ఆడవాళ్లు మాత్రం ఊరుకున్నారా? వీళ్లంతే వాళ్లకు స్వేచ్ఛ యిచ్చి

నంతవరకు పురుషులతో సమానంగా స్త్రీలుకూడా పనలు చేస్తూనే ఉన్నారు.''

"చిన్నపిల్లలచేత ఆటలు పాటలు ఆడించి, వినోదాలుచూస్తూ, పుస్తకాలు చదువుకుంటూ ప్రొద్దు పుచ్చుగుంటారని అనుకున్నానుగాని, ఈ ఆడపిల్లలు ఇంత కష్టపడి దేశానికి ఇంత ఉపకారమైన పనులు చేస్తున్నారని నేననుకోలేదండి. ఇప్పుడు చూస్తుంటే, సభలు సమాజాలవల్ల దేశానికి చాలా ఉపయోగమని, ఈఆడవాళ్లంతా సభలకు వెళ్లడం, సమాజాలకు వెళ్లడం వినోదాలకుకాదని ఇప్పుడు నాకు బాగా తోస్తున్నదండి.''

"అయితే, అన్నపూర్ణమ్మగారు సమాజాల్ని గురించి మీఉద్దేశ్యం ఏమిటంటారు?''

"మాణిక్యమ్మగారు! నిజంచెపుతున్నాను యిదివరకు మాత్రం సభలు సమాజాలు వినోదార్థమే ననుకున్నానుగాని, ఇప్పుడు నేను స్వయముగావచ్చి చూస్తున్న తరువాత సమాజాలు దేశోపకారానికేనని, అక్కడికివెళ్లేస్త్రీలు కష్టపడి ప్రజలకొరకు పనిచెయ్యటానికేనని నాకు గట్టినమ్మకం తోచిందండి,'' అన్నది అన్నపూర్ణమ్మగారు. ఇంతలో హాల్లో గడియారం ఐదుగంటలు కొట్టింది. అక్కడే ఆడుకుంటున్న అన్నపూర్ణమ్మగారి మనుమడు, మాణిక్యమ్మగారి మనుమరాలు, ఏడుస్తూలేచారు. యింటికెళదాం రా అని, రాగం మొదలుపెట్టాడు మనుమడు. మాటలతో ప్రొద్దు చాల గడిచింది, ఐదైంది యిక యింటికెళ్ళాలండి అని మనుమణ్ణి చంకపెట్టుకుని బైలుదేరింది అన్నపూర్ణమ్మగారు. అక్కడేఉన్న మనుమరాల్ని సముదాయిస్తూ చంకబెట్టుకుని వాకిలిదాకవచ్చి ఉంటానండి అని ఆమెదగ్గిర శలవుతీసుకొని ఇంట్లోకి వెళ్ళింది మాణిక్యమ్మగారు.

——(o)——

# చర్మబాధలకన్నిటికీ

# సైబాల్




చర్మవ్యాధులన్నిటిని శీఘ్రంగా నివారణచేసి, విషక్రిమి నాశనిరై త్వరితంగా కుదుర్చుటలో "సైబాల్" ప్రసిద్ధికెక్కింది - కురుపులు, గజ్జి, ఎక్జిమా, స్కాబీస్, మొటిమలు, తామర, కాళ్లపగుళ్లు, వ్రణములు మొదలైన వాటిని కుదర్చుడములో అద్భుతంగా పనిచేస్తుంది.



## బిడ్డల ఆరోగ్యమునకు

## ప్రసిద్ధిచెందినది:

# రమణీస్

# బేబిగ్రైప్






తయారీదార్లు:

## ది సౌత్ ఇండియన్ మాన్యుఫాక్చరింగ్ కో., మధుర.

డిస్ట్రిబ్యూటర్సు:

సీతారామా జనరల్ స్టోర్సు ఏజెన్సీస్ - విజయవాడ, శికింద్రాబాద్, బరంపురము (గంజాం), బొంబాయి.




తిర్చునాపల్లి కావేరి నది ఒడ్డునవుంది. చాలా కాలం క్రితం అక్కడ ఒక రాజు రాజ్యాన్నేలుతుండేవాడు. పాపం ఆ రాజు ఉత్త వెర్రివాడు. ఎవరు ఎలాచేస్తే అలా చేసేవాడు. రాజ ఆస్థానంలో ఒకమంచి "తెలివిగల మంత్రి" కూడా వుండేవాడు.

ఒక రోజు రాజు మంత్రితో కూడా విశ్రాంతికి కావేరినది ఒడ్డుకుపోయాడు. కావేరి నది పడమరనుంచి తూర్పుకు ప్రవహించటం చూచిన రాజు కాసేపు ఆలోచించి "....ఓయ్ మంత్రీ! ఇక్కడికి తూర్పున ఏ దేశం వుంది అని ప్రశ్నించాడు." దానికి మంత్రి... "ప్రభూ!.... ఇటు తూర్పున తంజావూర్ వుందండీ" అని చెప్పాడు. అందులకు రాజు "అయితే, మన నదిలోని నీరును తంజావూర్ ప్రజలు ఎందుకు త్రాగాలి? తక్షణం ఈ నదిలోని నీరు అటువైపు పోకుండా బంధించేసేయండి''అని చెప్పి వెళ్లిపోయాడు.

పాపం మంత్రికి లోపల ఇష్టం లేక పోయినప్పటికీ...మరేం చేస్తాడు? రాజాజ్ఞ నెరవేర్చి తీరాలిసిందే....పైకి మాత్రం ఇష్టంగా వున్నట్లు నటించాడు.

రెండో రోజు ఉదయానికల్లా నీళ్ళు తంజావూర్ వైపుకు పోకుండా బంధీ చేసేసారు. ఇంకేముందీ?...సాయంత్రానికల్లా తిర్చునాపల్లి సమస్తం నీళ్ళతో నిండిపోయింది. క్షణక్షణానికీ నీళ్ళుజాస్తవటమే కాని తగ్గటమేమోలేదు. క్రమేణా ఇండ్లల్లోకి కూడా నీరు ప్రవహించసాగినై.... ప్రజలు చాలా కష్టంలోపడ్డారు. మంత్రి పాపం ఎట్లయినా తమ ప్రజల కష్టాన్ని తొలగించవలెనని ఆలోచించటం మొదలు పెట్టాడు. కడకు మంత్రికి ఒక మంచి వుపాయం తట్టింది.

ఆ కాలంలో ఇప్పటిలాగా ఘడియారం లేదు. రాజమహాల్ వెనక ఒక సిపాయి జాముజాముకు గంట వాయిస్తూండేవాడు. దానివల్ల ప్రజలు గంట తెలుసుకునేవారు. మంత్రి సిపాయి దగ్గరకువచ్చి "ఓయ్ సిపాయీ! ఈ రోజు రాత్రికి నీవు తొందర తొందరగా గంట మ్రోగించ''మని చెప్పాడు.

మంత్రి చెప్పిన విధంగా సిపాయి తొందరగా గంట మ్రోగించి, సగంరాత్రికల్లా వేకువజాముగంట మ్రోగించాడు. ప్రజలంతా నిద్రనుంచి లేచారు. రాజు కూడా లేచాడు. కాని సూర్యుడేమో ఎంతసేపటికీ ఉదయించలా? ప్రజలంతా హడలిపోయారు-రాజుతోసహా.

వెంటనే రాజుగారు మంత్రిని పిలిపించి అడిగారు "ఇదేమిటి మంత్రీ! సూర్యుడింకా ఉదయించలేదే" అని.

మంత్రి చెప్పాడు! హుజూర్ "తంజావూర్ ప్రజలు సామాన్యులు కారండీ. వాళ్ళమహాసైతాన్లు. మనము నీళ్ళను తంజావూర్‌కు పోనీయకుండా బంధీచేసామని బహుశా ప్రతీకారం చేసేవానికని, సూర్యుణ్ణి కదలనీయకుండా పట్టుకొని వుంటారు. మీరు అనుజ్ఞయిస్తే బంధీనితీసేసి యథాప్రకారం తంజావూర్‌కు నీళ్ళుపోయేటట్లు చేస్తాము" అని చెప్పాడు.

రాజుకు ఆ సమయంలో అదే మంచి పనని తోచింది. సరే తొందరగా పనిని పూర్తికానీయండి అని చెప్పాడు.

బంధీనంతా మెల్లగా విప్పేటప్పటికి, తెల్లగా తెల్లవారింది సూర్యుడు ఉదయించాడు. అప్పుడు మంత్రి రాజుగారి దగ్గరికొచ్చి! మహారాజా "నదియొక్క బంధీనంతా ఇప్పేశాము, నీళ్ళను తీసుకొని తంజావూర్ ప్రజలు సూర్యుణ్ణి వదిలిపెట్టారు" అని చెప్పాడు.

పాపం వెర్రిరాజు ఉబ్బిపోయాడు. రాజుకు యిదంతా ఏమి తెలుసు? అంతా నిజమనుకున్నాడు. అలా ఎన్నాళ్ళో గుడ్డి పరిపాలనచేశాడు. మంత్రివుండబట్టి సరిపోయిందికానీ లేకపోతే ఆప్రజలగతి ఏమ ఏదో. రాజు మంత్రి తెలివికి చాలా మెచ్చుకున్నాడు. ప్రజలంతా మంత్రిమేలును మరువలేమని ఎంతో పొగడారు.

సి. జ్ఞానరత్నం




నేషనల్ ప్రొడక్షన్స్‌వారి తెలుగు 'సింగారి' త్వరలో విడుదల కాగలదు. లలిత, పద్మిని నటిస్తున్నారు.

♦ ♦ ♦

యువపిక్చర్స్‌వారి 'టింగురంగా' ఈ నెలలో విడుదల కాబోతున్నదట.

♦ ♦ ♦

ముక్కామలవారి 'మరదలుపెళ్లి'లో మద్రాసు అంబాలగాణి సూర్యకుమారి నటించడమే కాకుండా సంగీత దర్శకత్వముకూడ వహించడం ఒక ప్రత్యేకత. చిత్రనిర్మాణం చాలవరకు పూర్తి అయినదని వార్త.

♦ ♦ ♦

శుభోదయా వారి 'ఆదర్శం' చిత్రనిర్మాణం చురుకుగా సాగుతున్నది. శ్రీ హెచ్.వి. బాబు దర్శకుడు.

♦ ♦ ♦

'మేనరికం' జంపనవారి సృష్టి. చిత్రనిర్మాణము త్వరగా ముగించేందుకు ప్రయత్నిస్తున్నారు.
ఇందులో జి. వరలక్ష్మి, నారాయణరావు, హేమలత మున్నగువారు నటిస్తున్నారు.

♦ ♦ ♦

ప్రఖ్యాత కెమేరామన్ శ్రీ వి. యస్. రెడ్డిగారు 'పుట్టిల్లు' చిత్రానికి ఛాయాగ్రహణం నిర్వహిస్తున్నారు. ఇందులో అనేకమంది నూతన తారలకు ప్రవేశం కల్పించబడుతూందట.

♦ ♦ ♦

అంజలి పిక్చర్స్‌వారి 'పరదేశి' చిత్రం ఆంధ్ర తమిళములలో చకచక నిర్మాణం జరుగుచున్నది. ఇందులో నాగేశ్వరరావు, అంజలి, వసంత, రంగారావు నటిస్తున్నారు. సుప్రసిద్ధ దర్శకుడు ప్రసాద్‌గారి ఆధ్వర్యము క్రింద వాహిని స్టుడియోలో తయారగుచున్నది.



'సింగారి' చిత్రంలో లలిత.

♦ ♦ ♦

'రాజేశ్వరి' చిత్రంలో సెట్టింగులు, కత్తియుద్ధాలు చాలా బాగానున్నాయని వినికిడి. శ్రీరంజని, మాధురి, శ్రీరామమూర్తి చక్కగా నటించారు. ఇది శ్రీ ఆర్. పద్మనాభన్‌గారి సృష్టి.

—(o)—

# లోక వార్తలు

భారత రిపబ్లిక్ అధ్యక్షుడుగా డా. రాజేంద్రప్రసాద్, ఉపాధ్యక్షుడుగా సర్. సర్వేపల్లి రాధాకృష్ణగారలు ఎన్నుకోబడ్డారు.

♦ ♦ ♦

మద్రాసు శాసనసభకు స్పీకరుగా శివషణ్ముఖం పిళ్లె, డిప్యూటీస్పీకరుగా శ్రీ బి. భక్తవత్సలం నాయుడుగారలును, కవున్సిలు అధ్యక్షుడుగా డా. చెరియన్, డిప్యూటి అధ్యక్షుడుగా శ్రీ అల్లా పిచ్చై గారలు ఎన్నుకోబడిరి.

♦ ♦ ♦

ఈనెల 7-వ తేదీన ఢిల్లీలో గోధుమల ధర పెంచినందుకు అసమ్మతిని తెలుపుటకు దాదాపు 200 మంది స్త్రీలు ఢిల్లీరాష్ట్ర ప్రభుత్వ సెక్రెటేరియట్ యెదుట ప్రదర్శనలు చేశారు.

♦ ♦ ♦

అజ్మీరులో ఒక స్త్రీ 514 రేషను కార్డుల నుంచుకొన్నందుకు అరెస్టు చేశారు. ఈమె నగరమునందలి వివిధ రేషను షాపులలో ఈ కార్డులతో రేషను పుచ్చుకొంటుండేదట.

♦ ♦ ♦

చీరాల ఐ. యల్. టి. డి. కంపెనిలో పని చేయు కార్మికులు 6000 వేలమంది 1 గంటసేపు సత్యాగ్రహము చేసి జీతముతో సెలవును సాధించారు.

♦ ♦ ♦

ఆంధ్ర ప్రదేశ్ కాంగ్రెస్ రాయలసీమ క్షామనిధి వసూళ్లు రెండు లక్షల రూపాయలు దాటింది.

♦ ♦ ♦

భారత ప్రభుత్వాధ్యక్షుని జీతము, గవర్నర్ల జీతాలు తగ్గించబడునని విశ్వసనీయమైన వార్త.

♦ ♦ ♦

ఇళ్లకరువు మూలంగా కటక్‌లో ఫస్టుక్లాస్ మేజస్ట్రేటుగారు తమ కోర్టు విచారణ రోడ్డుప్రక్కన ఒక చెట్టుక్రింద జరుపవలసి ఏర్పడిందట.

♦ ♦ ♦

చిన్నపిల్లలకు చదువు నేర్పుటలో ఒక నూతన విద్యాపద్ధతిని కనిపెట్టిన డా. మేరియా మాంటిస్సోరి యీ నెల ఆరవ తేదీ మరణించింది.

♦ ♦ ♦

శ్రీ నీలం సంజీవ రెడ్డిగారే మరల ఆంధ్ర ప్రదేశ్ కాంగ్రెస్ సంఘానికి అధ్యక్షులుగా నెన్నుకోబడ్డారు.

♦ ♦ ♦

దక్షిణాదికి మధ్యప్రదేశ్, ఒరిస్సారాష్ట్రాల నుంచి రోజుకు 1400 టన్నుల బియ్యం వంతున రవాణా చేయడానికి 70 బ్రాడ్‌గేజివాగన్లు కేటాయించబడినవి.

♦ ♦ ♦

రాజ్ ఘాట్‌లో గాంధీ మ్యూజియం నిర్మాణానికిగాను గాంధీజీ సమాధికి సమీపంగా 40 యకరాల భూమి మంజూరు చేయబడింది.

♦ ♦ ♦

దేశంలోని బంజరు భూమిని సాగులోనికి తీసికొని రావడానికి 'లాండ్ డెవలప్‌మెంటు బోర్డు' అను పేర ఒక సంస్థను స్థాపిస్తున్నట్లు త్వరలో భారత ప్రభుత్వము ప్రకటించనున్నదట.

♦ ♦ ♦

భారత దేశానికి లక్షటన్నుల బియ్యం సప్లయి చెయ్యడానికి చైనా సమ్మతించింది.

♦ ♦ ♦

రాజాజీ మంత్రివర్గమునకు అసెంబ్లీలో స్వల్పమైన మెజారిటీ మాత్రమే ఉన్నందున చెన్నరాష్ట్రంలో తిరిగి ఎన్నికలు జరుగవచ్చునని పార్లమెంటుసభ్యుడు శ్రీ టి. టి. కృష్ణమాచారిగారు ప్రకటించారు.

♦ ♦ ♦

కాశీ, అలీఘర్, ఢిల్లీ విశ్వవిద్యాలయాల పద్ధతిపై ఉస్మానియా విశ్వవిద్యాలయాని నడపడానికి, విద్యాబోధనకు ప్రధానంగా హిందీ భాషను ఉపయోగించడానికి తగినట్లుగా కేంద్ర విశ్వవిద్యాలయంగా మార్చడానికి భారత ప్రభుత్వం నిశ్చయించింది.

♦ ♦ ♦

కొత్త పార్లమెంటు కాంగ్రెస్ పార్టీనాయకుడుగా తిరిగి పండిత నెహ్రూ ఎన్నికైనారు. వారు ప్రధానిగా 15 గురు సభ్యులతో కేంద్ర మంత్రివర్గం ఏర్పడుతుంది. అందులో శ్రీ వి. వి. గిరిగారు కార్మికశాఖ, శ్రీ గోపాలస్వామి అయ్యంగారు రక్షణశాఖ, శ్రీ టి. టి. కృష్ణమాచారిగారు వాణిజ్య, పారిశ్రామికశాఖలను నిర్వహిస్తారు.

♦ ♦ ♦

హైదరాబాద్ కాంగ్రెస్ అధ్యక్షపదవిని రామానందతీర్థగారు స్వీకరించారు.

♦ ♦ ♦

స్వామీ సీతారాంగారు ఆంధ్ర రాష్ట్రసమస్యపై గవర్నర్ శ్రీ ప్రకాశతో చర్చించిన సందర్భమున తాను యీ నెలాఖరున ఢిల్లీవెళ్లినప్పుడు అధ్యక్షునితో సంప్రదిస్తానని శ్రీ ప్రకాశగారు హామీయిచ్చారు.

♦ ♦ ♦

బ్రిటన్ అంతటినుండి వేలాది స్త్రీలు కామన్సు భవనానికి వచ్చి ప్రభుత్వ ఉద్యోగాల్లో తమకు పురుషులతో బాటు సమానంగా జీతాలివ్వాలని పార్లమెంటు సభ్యులను కోరనున్నారట.

♦ ♦

ముతక, మధ్యరకాలబట్టల ధరలు మే 1వ తేదీనుండి 100కి 5నుండి 24 వంతులవరకు తగ్గింపబడతవని భారత ప్రభుత్వం ప్రకటించింది.

♦ ♦ ♦

భద్రాచలమునకు సమీపమున నున్న వెంకటాపురం గ్రామసమీపంలో శల్యావశిష్టమైయున్న పులిని ఆప్రాంతీయులు చంపికొని చూడగా కడుపులో శల్యావస్థలో పందిముళ్లు కనుపించాయట. ఆ పులి చిక్కిపోయి నుండుటకు దానికడుపులో ముళ్లు గ్రుచ్చుకొనియుండటమేనని అక్కడి వారు అభిప్రాయపడ్డారు.

♦ ♦ ♦

మదరాసులో ఇటీవల రాయలసీమ క్షామబాధితుల సహాయార్థం జరిగిన తారాగణం ప్రదర్శనానికి ఖర్చులుపోను పదివేల రూపాయల చిల్లర వసూలయినదట.

———o———

(15-5-1952 నుంచి, 15-6-1952 వరకు.)




త్రికాలవేది, జ్యోతిష్చక్రవర్తి, ప్రొఫెసర్ కె. ఆంజ

## మేషం :

శుభవార్తలు, శుభకార్యముల వ్యయం, విద్యా జయం, బంధు ఆగమనం, కుటుంబవృద్ధి, రాజ తుల్యుల సందర్శనం, నేత్రాలకసౌఖ్యం, ఉష్ణాతి శయం, వేడిపదార్థాలు తినరాదు. నోరు పొక్కు తుంది. అగ్నినష్టం, కోపాధిక్యం. ఆత్మబంధువులకు జ్వరం, విద్యాజయం, అదృష్టలాభం, శ్రమనివారణం, కలహనివృత్తి, అధికారోన్నతి, దర్ప, గ్లాసు, రత్నాలుకొనుట, డాక్టర్ల సహాయం, వృత్తిలో మార్పులు, ప్రయాణం, బుద్ధివినోదం.

## వృషభం :

అనారోగ్యం, శత్రుమయం, అసంతుష్టి ఆదిలో కల్గి ఆ మీదట కార్యములు విశేష కర్చుతో నడుప బడుట, ఉష్ణాతిశయం, త్రిప్పట, బంధుహాని, దూర దర్శకత్వం, వ్యవహారజయం, స్త్రీలకాపదలు, శుభ వార్తావళి, పుణ్యకర్మములు, దైవసేవ, బంధుసహా యం, మిత్రమోసం, పరోపకారం, అలంకారాది, అశ్రయత్వం. దుర్బోధనలువినుట, చిన్నలకశుభం, ముసలివారికి సామాన్యలాభం, జ్ఞాతిక్షయం, బుద్ధి వికాసం తక్కువ, అతిగర్వం, శరీరంలో మచ్చలు రాగలవు, చర్మవ్యాధి, మిత్రవంచనం, దుష్టనీచమైత్రి చేదెబ్బకల్గును.

## మిధునం :

సంతోషం, పరీక్షాజయం, ఉన్నతి, క్రొత్త విద్యా లాభం, విజ్ఞాన వృద్ధి, శుభవార్తావళి, వృధాదుఃఖం, ఉష్ణవాతవ్యాధి, బంధు ఆయాసం, మిత్రవంచనం, స్వాంతరక్తంగల వారితో తగాదా, మోసంనుంచి తప్పుకొనడం, ప్రయాణాలుచేస్తే ప్రమాదం, ఆకలి దప్పులవస్తలు సతాయిస్తవి. గ్రంధసేవ, రత్నాభర ణాదులపై అయిష్టం, సేవకుల దొంగతనం కను గొంటారు, త్రిలోక సంచారులను యింటికి చేర్చడం వల్ల స్వంతవారుకూడా చెడిపోతారు, రాజతుల్యత, క్రొత్తవి కొంటారు, వాహనసుఖం, మంచిపేరు, చిన్నలకుగండం, కోపాధిక్యం, భాగస్థులపేకద్దు.

## కటకం :

పనులు యిన్నాళ్లు, నడవనివన్నీ యిప్పుడు తొందరగా అవుతూవుంటవి, పుణ్యకార్యాలు చేస్తారు, రహస్యాలు దాగవు, అతిగా సంభాషించ రాదు, అంతరంగికులపరారు, నీళ్లవల్ల ప్రమాదం, పశువులుంటే అమ్మండి, లేనిచో నష్టపడుతారు. బంధుహాని, వస్తువులు పగులుట, నదుల్లో భావుల్లో ఈదరాదు, అతిదప్పి ప్రమాదం వుండిన రాత్రిపూట కూడా రెండు దఫాలు నీళ్లు త్రాగండి, విద్యాలాభం, చిత్రాలు చూస్తారు. వృశ్చికాదులపీడ, సాధువుల

మాట వినరాదు, పుణ్యక్షేత్రాలకు పోవుట, అపాయాలు తప్పుతవి, అధికార్ల ప్రాపకం, విద్యాగ్రంథ లాభం.

## సింహం :

స్త్రీలకు గండం, ఇంట్లో నసకూడదు, ఇంట్లో చాలాసేపుంటే తగవులురాగలవు, బజార్లలో కాలం వెళ్ళబుచ్చండి, పెద్దల గండము, వ్రాతకోతలు దివ్యములు, అతిసుఖం-అతిఅసుఖం, ఏదీ నమ్మడానికి వీలులేదు, నేత్రబాధ, సత్యసంకల్పం, మహైశ్వర్యవంతుల లాలించుట, మిత్రభేదం, బంధుద్రోహం, పశుసేవకవాహన కష్టవ్యయములు, ఇనుపకర్ర లోహ సామానులు కొంటారు, ముసలివాండ్రకు శ్రమ, అతి త్రిప్పట, దూరదేశాలనుంచి శుభవార్తలు, బ్యాంకుల్లో ధనం దాచుకొంటారు, వృత్తి వ్యాపారాలు అమోఘాలు.

## కన్య :

కార్యముల మాంద్యం, రాజకోపం, రొక్కధన వృద్ధి, నేత్రబాధ, దంత అసౌఖ్యం, బంధుశ్రమ, విద్యాపజయం, పండిత సహాయము, నిధి నిక్షేప యోగా లున్నందున అనుకోని సహాయతరాగలదు, శత్రునాశనము, దొంగలవల్ల నష్టం, సర్పావృశ్చిక సందర్శనం, కష్టనివారణము, సంతాన, విద్యా, వ్యాపార, వృత్తి జయం, ధనవిభవవృద్ధి, శ్రీమంతుల చెల్మి, పరీక్షాజయం, రహస్య చరిత్వం దాగదు, నమ్మినవారి ద్రోహం, అవిశ్వాసము, ఆనందం, ధన పుకసాలా తీరును, దైవసేవ ముఖ్యం, ఆత్మ బంధువుల నష్టం.

## తుల :

డబ్బుమీద ఆశ అతిశయిస్తుంది, శ్రమ తక్కువ, క్రొత్తమైత్రి, సంకల్పసిద్ధి, కోరికలు సవ్యమార్గంలో పెట్టగలవారు మిమ్మ మంచిలోకి తేవడానికి క్రొత్తగా వస్తారు, బంధువుల సహాయత లభిస్తుంది, గొప్ప కలహాలు ఇంట్లో వార్లతో ఇరుగు పొర్గూ వార్లతో రావచ్చు, ఏకాంతంలోవుంటే ప్రమాదం వస్తుంది, కావున నల్గురిమధ్య వుండడం ముఖ్యం, లాభంలేని పనిని చెయ్యరు, డబ్బు మరల చేరుతుంది, వృధాచెయ్యకుండా మీమీద అభిమానంగల్గి మీ పురోభివృద్ధి కోరినవారి సలహా ప్రకారం చెయ్యండి. విద్వాంసుల ఆగమనం, రత్నాభరణాల మార్పు. క్రొత్త వ్యాపారం, గృహాభివృద్ధి, చిన్నలపై ఆందోళన, రహస్య శత్రునాశనం, సేవక ద్రోహం.

## వృశ్చికం :

ఎటుచూచిన రణక్షేత్రమే అయినా విజయం కల్గుతుంది. విద్యా వినోద వైభవం, రత్నాభరణములకై వృధావ్యయం, అనారోగ్యం, పందాల్లో అపజయం, స్వంత ప్లానులవల్ల నష్టం, అతిదాపరికం అంతా బైటపడిపోతుంది, అసుఖం, శరీర అనారోగ్యం, డ్రైవింగు ప్రయాణాలు చెయ్యరాదు, అధైర్యం, అదృష్టం వస్తూవుంటే దారిలో కొట్టేస్తారు, మిత్రులతో ఘర్షణం, విద్యా వినోదాలకు అతృప్తి, ప్లానులు వ్యతిరేకంగా సాగుతూ వుండడంవల్ల వ్యతిరేకంగా ఆలోచిస్తే అవి సత్యంగా నెరవేరగలవు, ప్రమాదాలు తప్పడమే ఈ నెలలో మీకదృష్టం అని చెప్పొచ్చు, పెండ్లిళ్లకు పోరాదు, చిన్నలకు గండం, అవమానం వస్తుంది.

## ధనుస్సు :

కర్చుజాస్తి, త్రిప్పట, సంతానాది శుభం విద్యా ధనప్రాప్తికాని కలిగితీరుతుంది, మహైశ్వర్యం, మతి స్థిమితం, కుటుంబ బహుత్వం, మధుర వాక్కుల నుపయోగించడంచే అతిజయం కల్గుతుంది. దివ్యస్థలాలు చూస్తారు, శృంగారవస్తు సామగ్రి ఆభరణ, గ్రంథ, సినిమా, మొదలగువాటివల్ల అతిధనప్రాప్తి, శుభాసక్తి సోమరితనం హెచ్చుతుంది, క్రొత్త కంపెనీలు కాని, బంధువులకాని మీకు చాలా ఉపయోగిస్తారు, ఒక గొప్ప విద్వాంసుడు మీకోసం గొప్పవి తెస్తాడు, వాటివల్ల విశేష ఆదాయంకద్దు. భోజన సౌఖ్యం, రాజకీవి, మనోహరవస్తులాభం, సంతోషం, శుభవ్యయం.

### మకరం:

అతిప్రీతికరముగ వాటిని సంపాదించి ఉపయోగంవల్ల లాభాన్నికూడా పొందుతారు. స్త్రీ పురుష పరస్పర ప్రణయగౌరవ వుండదు, బంధువులు సన్మానాలు పంపుతారు, బహుమానాలు వస్తవి, బ్రహ్మచారులకు వివాహాది శుభాలు జరిగేకాలం, పెద్దలకు శుభం, ఉన్న ఆపద పోతుంది, రహస్యమయంగా వెన్నాడి శత్రువులంతా మంచివారవుతారు, ముసలివారిపోరు కొంత తప్పుతుంది, ఇతరాస్థి పొందుతారు, రక్త సంబంధీకులకంటే ఇతర్లవల్లమేలు, చిన్నలకు శుభం, సంతోషం, ధనపుకష్టాలు తీరుతుంది, వస్త్రాభరణప్రాప్తి, ప్రత్తి వ్యాపారం జయం.

### కుంభం:

మీరుకాని, మీపార్టీకాని, మీనిర్మాణములుకాని అతిలాభం పొందుతవి, ప్రయాణాలుంటవి, జాగుపోతుంది, ధనాగమంకద్దు, వ్యాపారవృత్తులు మరల పూర్వంకంటె అతిగొప్పగా నడుస్తవి, నీచజాతుల సహాయం, అధర్మ బుద్ధికి వెళ్లడంవల్ల ఆపదలు రాగలవు, ముప్పులు తప్పుతవి, సినిమాలపై అతిప్రీతి, అనుకూలం, కార్యాదులు యిష్టప్రకారం సిద్ధించుతవి, ముఖ్యుల దూరస్థం, ముసలివారికి గండములు తప్పుతవి, వాహనసేవక లాభం, శుభాసక్తి, ధైర్యవృద్ధి, చిన్నలకు శుభం, మిత్రసహాయం, ఉత్సాహం, మంచివార్తావళి, అదృష్టజయం, బహుజనపోషకత్వం.

### మీనం:

చంచలత్వంవల్ల కార్యాలు చెరుచుకొంటారు, ధైర్యం తగ్గుతుంది, కొంతకాలం హెచ్చుతుంది, బహుప్రజాసేవ, అతిగా మాట్లాడరాదు, పల్లెలు అన్ని వైపుల వస్తవి, శత్రువులు మిత్రులవుతారు, పుస్తకాలు కొంటారు, నూత్నసామగ్రికోసం కర్చుజాస్తి, బంధువులకోసం వెళ్లితే వారు అచ్చట వుండరు, అతిత్యాగబుద్ధివల్ల లాభాన్ని అంతా చెరుచుకోకుండా పెద్దల యిష్టప్రకారం నడువవలెను, స్త్రీలవల్ల ధనలాభం, సహాయం సకాలంలో రాగలదు, గ్రంథ పురాణ పఠన శ్రవణములవల్ల క్రొత్త వికాసం కలుగుతుంది, అనుమానాలు పోతవి, రాజ్యాధికారం, ఉన్నతి, సర్వసమృద్ధి.

# కేసరి విద్యాసంస్థ వార్షికోత్సవము

ఏప్రియలు 16-వ తేదిన కేసరి విద్యాసంస్థ వార్షికోత్సవము కేసరి హైస్కూలు ఆవరణలో శ్రీ వి. వి. గిరిగారి అధ్యక్షతన వైభవముగా జరిగింది.

ఉత్సవమునకు న్యా॥ ప్రత్తిపాటి సత్యనారాయణగారు, మద్రాసు విద్యాశాఖమంత్రి శ్రీ యమ్. వి. కృష్ణారావుగారు, మద్రాసు అందాలరాణి శ్రీమతి సూర్యకుమారి, తదితర ఆంధ్ర ప్రముఖులు పలువురు హాజరయిరి. ఈ సందర్భమున శ్రీ కేసరిగారు పాఠశాలకు బహూకరించిన శ్రీ బండి శ్రీహరిరావు నాయుడుగారి చిత్రపటమును శ్రీ వి. వి. గిరిగారు ఆవిష్కరించిరి.

విద్యాసంస్థ అధ్యక్షులు శ్రీ అల్లాడి కృష్ణస్వామిగారు స్వాగతోపన్యాసములో నిట్లు చెప్పిరి.

"మద్రాసు నగరంలో తెలుగు విద్యాబోధనకు డాక్టరు కేసరిగారొనరించుసేవ ప్రశంసనీయమైనది.

శ్రీ గిరిగారు ప్రజాసేవా తత్పరుడు. వారికి కేంద్రప్రభుత్వములో బాధ్యతతోకూడినపదవి లభించగలదని ఆశిస్తున్నాను.

కరువు కాటకములతో ఉక్కిరి బిక్కిరి అగుచున్న మద్రాసు రాష్ట్రమునకు శ్రీ యమ్. వి. కృష్ణారావు గారు మంత్రి అయినారు. ఆయన బాధ్యత తేలిక అయినది కాదు. క్షామనివారణకు శక్తివంచన లేకుండా కృషిచేయవలసియున్నది. ఇందుకు పార్టీ విభేధాలు అడ్డురాకూడదు. ఈ విషయాన్ని మంత్రివర్గము సమిష్టిగా పరిస్థితుల తీవ్రత దృష్ట్యా గుర్తించినట్లున్నది.





కేసరి విద్యాలయముల బాలబాలికలు ప్రదర్శించిన 'రాణీప్రమీలార్జునీయం'లో నొక సన్నివేశము.

కేసరిగారి విద్యాదానములు, అంతేకాక దానసంకల్పసిద్ధికి వారు చేయుచున్న కృషి అపారము, అందుకుగాను శ్రీ హరిరావునాయుడుగారి సహకారము చాల అమూల్యమైనది. అందుకనే శ్రీ నాయుడుగారి చిత్రపటమును విద్యాలయములో ఆవిష్కరణ నిమిత్తం శ్రీ కేసరిగారు బహూకరించారు.

శ్రీ గిరిగారు మాట్లాడుచు "కడుపేదగ మద్రాసుకువచ్చి స్వయంకృషివలన ధనం సంపాదించి యిట్టి సంస్థలను నడుపుచున్న ఆంధ్ర ప్రముఖులు శ్రీ కేసరిగారు. వీరి జన్మదినోత్సవం జరుపడం ఎంతైన సంతోషకరమైన విషయం" అని శ్రీ బండి శ్రీ హరిరావునాయుడుగారి చిత్రపట ఆవిష్కరణ సందర్భమున "నాయుడుగారిని నాకు చాల కాలమునుండి తెలుసును. కార్యదీక్ష, ఉద్యోగ ధర్మంతోబాటు ప్రజా సేవా తత్పరత వారిని ఆదర్శప్రభుత్వోద్యోగిగా నొప్పించినవి. వారి చిత్రపటము నవిష్కరించుట మహా భాగ్యం" అని ముగించారు.

విద్యామంత్రి శ్రీ కృష్ణారావుగారు మాట్లాడుచు "శ్రీ కేసరిగారి జీవితచరిత్ర ఆదర్శప్రాయమైనది. వారు దేశోద్ధారక, విశ్వదాత కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారిలాంటి దాతల వర్గానికి చెందినవారు. వారిచే స్థాపించబడిన యీ విద్యాలయముల అభివృద్ధి ఉత్సాహకరంగానున్నది. నా భార్య ఉపాధ్యాయిని అగుటవలన నాకు పిల్లలతోను, విద్యాలయములతోను పరిచయమున్నది. నా శక్తివంచనలేకుండా ప్రజాసేవ చేయాలనే యీ మంత్రిపదవిని స్వీకరించాను. ఈ సంస్థ నిర్మాణముచేసిన శ్రీ కేసరిగారికి చిరాయురారోగ్యం భగవంతుడు ప్రసాదించుగాక" అనిరి.



డా. కేసరిగారు మాట్లాడుచు "ఈ విద్యాలయముల అభివృద్ధికి విద్యాసంస్థ పోషకవర్గమునకు నేను కృతజ్ఞుడను. ముఖ్యంగా కార్యదర్శి శ్రీ హరిరావునాయుడుగారికృషి అమోఘమైనది. నాయుడుగారి కార్యదీక్ష, పలుకుబడివలన కేసరి విద్యాలయం కళాశాలగా కాగలదు.

మద్రాసు నగరంలో అనేక సంస్థల అభివృద్ధికిగాను ముఖ్యంగా తమిళులు పాటకచ్చేరీలు, నాటక ప్రదర్శనములు అనేకం ఏర్పాట్లు చేస్తున్నారు. తెలుగువారిలో అట్టి ప్రయత్నములు లేకపోవడం విచారకరం. ఆంధ్రప్రజానీకం సహకరిస్తే శ్రీ హరిరావునాయుడుగారివెంట నేను బయలుదేరి త్వరలో కళాశాల నిర్మాణం కొనసాగించగలం. ఈ పని విద్యామంత్రి శ్రీ కృష్ణారావుగారి హయాములోనే జరుగలని నా ఆశ" అని ముగించారు.

కేసరి విద్యాసంస్థ కార్యదర్శి దివాన్ బహదూరు బండి శ్రీ హరిరావునాయుడుగారు సంస్థ తాలూకు పాలనా నివేదికను సమర్పించారు.

స్కూలు పిల్లలచే నిర్వహించబడిన వినోద ప్రదర్శనములలో మొదట త్యాగరాయనగర కేసరి ప్రాథమిక పాఠశాల బాలబాలికలు ప్రమీలార్జునీయ, నాటకమును బాగుగా ప్రదర్శించిరి. తర్వాత కేసరి హైస్కూలు బాలికలు "చెవిటి మాలోకము" అను ప్రహసనమును, ఆ స్కూలు బాలురు "ఇంటిమందు" అను ప్రహసనమును ప్రదర్శించిరి. ఆఖరున భారతకళామందిర బాలబాలికలు రాజమండ్రి కాపురస్థులు శ్రీ వాడ్రేవు కామరాజు బి. యె. గారిచే రచింపబడిన "మంగమ్మక్క" అను ప్రహసనమును ప్రదర్శించిరి. అన్ని ప్రహసనములు అయ్యేవరకూ సభ్యులు కదలకుండానే వున్నారు.

శ్రీమతి సూర్యకుమారిగారు బాలబాలికలకు బహుమతులను పంచిపెట్టారు. శ్రీ శ్రీపతి రామమూర్తిగారి వందన సమర్పణముతో కార్యక్రమం ముగిసింది.

'సిసి'




**జాజిమల్లి : శ్రీ అడవి బాపిరాజుగారు. ప్రచురణ 'ఆంధ్రమహిళ' కార్యాలయం 14 ద్వారక, మైలాపూరు, మద్రాసు వెల 1-8-0**

ఇది నవల. కథావస్తువు చాల మనోజ్ఞంగా నడిచింది. పల్లెల్లోను, అనాగరీక వాతావరణములోను పుట్టి పెరిగినా స్త్రీ అవకాశాలనుబట్టి ఉత్తమ సంస్కారముల నలవరచుకొని నలుగురిలో కలసిమెలసి తిరుగగలదని నిరూపించడమే యీ నవల ఉద్దేశం, ఆదర్శం. ఇందులోని నాయకి బెస్తకులంలో పుట్టి, బెస్తలతో పెరిగిన పద్మ సంస్కారము మూలంగా తన జీవిత విధానాన్నే మార్చుకొన్నది.

ఆంధ్రమహిళాసభవారి అభ్యుదయ కార్యక్రమంతోబాటు యిట్టి ఉత్తమ గ్రంథ ప్రచురణము సంఘములోని అనేక ఉత్తమ పరిణామాలకు అవకాశమిస్తుంది.

**శ్రీ వావిళ్ల వేంకటేశ్వర శాస్త్రిగారి షష్టిపూర్త్యుత్సవ సన్మాన సంపుటం, ప్రకాశకులు వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండు సన్సు.**

1948 సం॥ ఏప్రియలు 8-వ తేదిన జరిగిన శ్రీశాస్త్రిగారి షష్టిపూర్తి సభాసమావేశమునకు డా. సర్. కట్టమంచి రామలింగారెడ్డిగారు అధ్యక్షత వహించిన సందర్భమున నాటి వృత్తాంతములు, సందేశములుగల 240 పుటలుగల గ్రంథము. వానితోబాటు పండిత ప్రవరులు వ్రాసిన సాహిత్య పరిశోధక వ్యాసములుగలవు. గ్రంథాలయములందు తప్పక నుండతగిన గ్రంథము.

**స్త్రీ జనాభ్యుదయశాఖ కరపత్రం : ప్రచురణకర్తలు స్త్రీ జనాభ్యుదయశాఖ కార్యాలయం, గవర్నమెంటు హౌస్, మౌంటురోడ్డు, మద్రాసు 2.**

ఇందు మనరాష్ట్రమందు ప్రభుత్వ యాజమాన్యమున జరుగుచున్న స్త్రీ జనాభ్యుదయ కార్యక్రమము వివరించబడింది.

ఇట్టి కరపత్రాలు మహిళాభ్యున్నతికి ఎంతైనా ఉపకరిస్తవి. మహిళా ఉద్యమము నలుదెసల వ్యాపించుట కుపకరిస్తవి. ఇట్టి కార్యక్రమాన్ని నడుపుతూ, దానికి సంబంధించిన ఉత్తమ వాఙ్మయాన్ని నారీలోకానికి అందచేస్తున్నందుకు మద్రాసు ప్రభుత్వమువారు అభినందనీయులు.

**రామచిలుక : శ్రీ వత్స. ప్రకాశకులు బుక్‌మన్స్, మద్రాసు 7. వెల 1-8-0.**

ఇందులో చిన్న చిన్న కథలు ఏడున్నవి. అందులో 'రామచిలుక' ఒక కథ. కథలు సరళమైన శైలిలో అనేక దైనిక జీవితములోని ఘట్టాలను ప్రతిబింబిస్తూ యున్నవి. చదువను చదువను ఉత్సాహము అతిశయిస్తుంటుంది.

అట్టమీద వర్ణచిత్రం, ముద్దులమూటకట్టే తయారీ, ముద్రణ పుస్తకమును చాల ఆకర్షణ వంతంగా నొనరించినవి.

———(0)———

# సంపాదకీయములు

## రాయలసీమ క్షామనివారణ నిధివసూళ్లు

రాయలసీమ ప్రాంత్యములోని దుర్భర పరిస్థితులను గురించి ప్రతిదినం వింటున్నాము. ప్రజలకు, పశువులకు తినడానికి ఆహారం లేదు; త్రాగడానికి నీళ్లులేవు. వర్షాభావంవలన చెట్లు, పైర్లు మలమలమాడి పోయినవి. ఈ పరిస్థితులను యితర ప్రాంతీయులు అవగాహనంచేసికొంటే అచ్చటి ప్రజానీకం, పశువులు, తోటలు ఎలాగ మాడిపోతున్నవో అర్థంచేసికోవచ్చు.

అగచాట్లలోనున్న రాయలసీమ ప్రాంత్యాన్ని కనికర దృష్టితో చూడాల్సిన బాధ్యత మనమీద పడింది. కాబట్టే దేశవ్యాప్తంగా సహాయం విరివిగా సమీకరించబడుతున్నది. ప్రజలు సయితము చూపు చున్న సానుభూతి, చేస్తున్న సహాయం రాయలసీమను ఆపద్దశనుండి రక్షించగలవనే చెప్పవచ్చును.

ధనము, ధాన్యము, పశువులకు గడ్డి దేశవ్యాప్తంగా సేకరించబడుతున్నవి. క్షామనివారణ కార్యక్రమంలో సైనికులు సయితం వినియోగించబడుతున్నారు. ఈ కష్టదశలో వివిధసంఘాలు, సంస్థలు విశాల దృక్పధంతోటి, సానుభూతితోటి కృషిచేసి వసూలయిన ధనధాన్య ఆహారాదులను కరువుకాటకాల నివారణకు వినియోగించాలి.

ప్రతిమానవుడు తానుచేయగల సహాయాన్నిచేసి ఆకలి దప్పులతో అలమటిస్తున్న రాయలసీమ ప్రాంత్యానికి సహాయపడటం ప్రధమ ధర్మం.

ఈ సందర్భంలో రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు సయితం చేస్తున్న సహాయం, చూపుచున్న సానుభూతి హర్షింపతగినది.

## స్వాగతము.

ఇద్దరూ జాతీయవాదులు, విశాల హృదయులు, మేధావులు. గాంధీజీ నిర్మాణ కార్యక్రమంలో అచంచలమైన నమ్మకంతో మానవసేవయే లక్ష్యంగాగల స్వార్థత్యాగులు. వీరే భారత రిపబ్లిక్ అధ్యక్ష ఉపాధ్యక్షులు డా. రాజేంద్రప్రసాద్, సర్ సర్వేపల్లి రాధాకృష్ణగారలు.

ఇక మరల భారత పార్లమెంటు కాంగ్రెస్‌పార్టీ నాయకుడుగా ఎన్నిక అయిన పండితనెహ్రూ ప్రధాన మంత్రికా నుండటం భారత రాజ్యాంగానికి ఒక మహదవకాశము.

ముగ్గురిని మేము హృదయ పూర్వకంగా అభినందిస్తూ, స్వాగత మిస్తున్నాము.

డా. రాజేంద్రప్రసాద్ భారత స్వాతంత్ర్య సమరయోధులలో నాయకశ్రేణికి చెందినవాడు. ఆయన ఉత్తమ ఆదర్శాలు, విశాలభావాలు, స్వార్థరహితమయిన సేవాపరాయణత ప్రశంసనీయములు,

## సంపాదకీయములు

జాతీయ కాంగ్రెస్ నాయకుడుగా సంస్థలో సుస్థిరమైన కట్టుబాటును, క్రమశిక్షణను పాటుపడి క్లిష్టపరిస్థితులలో ధైర్యంగా నాయకత్వమువహించి నిర్వహించాడు. ఇట్టి ఉత్తముడు, ప్రజాసేవకుడు ఏకగ్రీవంగా అధ్యక్షస్థానానికి ఎన్నుకోబడవలసినవాడు. అలా కాకపోయినా అత్యధిక ఓట్ల మెజారిటీతో ఎన్నుకోబడటం దేశము మొత్తముమీద ప్రజలకు అయనమీదగల భక్తి తాత్పర్యాలు, ప్రేమాతిశయాలు వ్యక్తమయినవి.

సర్. రాధాకృష్ణగారు విఖ్యాత వేందాతి, విద్యావేత్త, మేధావి, భారత సంస్కృతి, నాగరకత, ఆచార వ్యవహారాలను, తత్వశాస్త్రాన్ని క్షుణ్ణంగా అవగాహనము చేసికొని వానిని విదేశాలలో సయితం నిరంతరము ప్రచారము చేయడానికి కృషిచేస్తున్నవారు. వారికృషిమూలంగా విదేశాలవారు భారతదేశాన్ని, సంస్కృతిని, మతాలను అర్థము చేసికొనడమేకాక ప్రపంచములో మనదేశపుపేరు ప్రతిష్టలు విశేషముగా వ్యాపిస్తున్నవి; ఇతర దేశాలతో సన్నిహిత సంబంధాలు ఏర్పడినవి. వారిమేధా సంపత్తికి, పాండిత్యానికి విదేశపండితులు సయితము అచ్చెరువొందుచున్నారు. ఈ మధ్య ఐక్యరాజ్యసమితిలోను, రష్యాలో భారతరాయభారిగాను విశేషపేరు ప్రఖ్యాతులు గడించారు.

ఆంధ్ర, బెనారెస్ హిందూ యూనివర్సిటీలకు వైస్‌చాన్సలరుగా వారొనరించిన సేవ అపారం.

డాక్టరు రాజేంద్రప్రసాద్‌వలెనే వీరు పార్టీ, కులమతవర్గ రాజకీయాలకు అతీతుడు. వీరు భారత రిపబ్లిక్‌కు ఉపాధ్యక్షుడుగా పోటీలేకుండా ఎన్నుకోబడటం ఒక ప్రత్యేకత.

మరల భారతప్రధానికానున్న పండితనెహ్రూగారి నాయకత్వము లభించడం మహాభాగ్యం. వారి విశాల భావాలు,- అనుభవము, పరిపాలనా దక్షత, త్యాగసేవాసక్తి అయోమయపరిస్థితిలోనున్న మనదేశానికి ఆ రేఖలు. వారికి ప్రజలు సహకరించి వివిధ సమస్యలను పరిష్కరించుకోకలుగుతారనడానికి సందేహం లేదు.

## కేంద్రరాష్ట్ర శాసన సభలు - స్త్రీల ప్రతినిధులు

మద్రాసు రాష్ట్రమంత్రి వర్గంలో ప్రాతినిధ్యము లభించకపోయినా, శాసనసభా స్పీకరు, డిప్యూటీ స్పీకరు పదవులలోగాని, కవున్సిలు అధ్యక్ష ఉపాధ్యక్ష పదవులలోగాని ఏ ఒక్కటి లభించకపోయినా కేంద్రమంత్రి వర్గంలో మాత్రం శ్రీ రాజకుమారి అమృత్ కౌర్ మంత్రిగానుండటం సంతోషించతగిన విషయం.

మద్రాసు కవున్సిలుకు నియమించబడిన స్త్రీ ప్రతినిధులు శ్రీమతి ముత్తులక్ష్మిరెడ్డి, శ్రీమతి మంజుభాషిణి, శ్రీమతి క్లబ్‌వాలా, శ్రీమతి సుబ్బలక్షిగారలు అనుభవశాలురు. సంఘసేవలో నిమగ్నులైయున్నవారు. మహిళా ఉద్యమంలో అనేక సంవత్సరములు పాటుపడుచు, అనేక స్త్రీలకు సంబంధించిన సమస్యల పరిష్కారమునకుగాను వినుగు, విరామములేక పనిచేయుచున్నవారు. వీరి నియామకం సందర్భంలో మద్రాసు ప్రభుత్వము వారు అభినందనీయులు. వీరి హయాంలో పరిష్కారానికి ఎదురుచూచుచున్న వైద్య సహాయం, మాతా శిశుసంరక్షణాలయాలనిర్మాణం మొదలగు వివిధ ప్రధాన సమస్యలు పరిష్కారం కాగలవని నమ్ముచున్నాము.

## శ్రీ నందననామ సం॥ర వైశాఖ-జ్యేష్ఠమాసములు.

| | | | |
|---|---|---|---|
| మే నెల | 16 | శు | స 14.13 శ్ర 2.52 ది 12.6 |
| | 17 | శ | అ 7.50 శత 54.10 ది 14.55 |
| | 18 | ఆ | న 1.52 ఏష్య 54.29 పూ.భా ది 9. హనుమజ్జయంతి |
| | 19 | సో | ఏ 51.59 ఉ.భా 48.12 త్యా 3.50 శుక్రమౌఢ్యారంభం |
| | 20 | మం | ద్వా 48.41 రే 46.42 ది 17.22 త్యా 3.54 |
| | 21 | బు | త్ర 46.35 అశ్వ 46.23 రా 4.28 త్యా 3.59 |
| | 22 | గు | చతు 45 41 భ 7.16 ది 10.38 మాసశివరాత్రి |
| | 23 | శు | ● అమా 46.4 ది 18.14 |
| | | | **జ్యేష్ఠమాసము** |
| 1952 సం॥ | 24 | శ | శుద్ధపాడ్యమి 47.32 కృ 52.36 ది 31.38 త్యా 4.13 అమృతసిద్ధియోగః |
| | 25 | ఆ | వి 50 4 మృ 56.50 ది 7.27 త్యా 4.17 భానువిదియ |
| | 26 | సో | త 53.28 ఆర్ద్ర 60.10 ది 19.37 త్యా 4.22 రంభాగౌరీవ్రతం |
| | 27 | మం | చ 57.33 ఆర్ద్ర 2.4 రా 2.58 కుజచతుర్థి |
| | 28 | బు | ప 37.10 పున 7.42 ది 29.47 త్యా 4.24 |
| | 29 | గు | ష 2.1 పుష్య 13.40 రా 16.56 అమృతసిద్ధియోగః |
| | 30 | శు | ష 6.32 ఆశ్రే 19.41 రా 20.37 త్యా 4.23 |
| | 31 | శ | స 10.52 మ 25.28 వ 10.52 కర్తరీత్యాగం |
| జూన్ నెల | 1 | ఆ | అ 14.44 పూఫ 30.46 రా 18.8 అమృతయోగం |
| | 2 | సో | న 17.51 ఉ.ఫ 35.21 రా 25.37 |
| | 3 | మం | ద 20 9 హ 39.0 రా 27.50 త్యా 4.10 |
| | 4 | బు | ఏ 21.19 చి 41.3 రా 23.43 త్యా 4.6 తిథిః |
| | 5 | గు | ద్వా 21.18 స్వా 42.53 రా 24.50 |
| | 6 | శు | త్ర 20.2 విశా 42.59 వా 20.43 |
| | 7 | శ | చతు 17.31 అనూ 41.52 త్యా 3.52 |
| | 8 | ఆ | ○ పౌ 13.54 జ్యే 39.40 రా 26.32 మరీచిపూర్ణిమా |
| 1952 సం॥ | 9 | సో | బహుళపాడ్యమి ప్ర 9.14 మూ 36.30 రా 0.14 |
| | 10 | మం | విదియ 3.43 ఏష్యం 52.47 రా 19.3 |
| | 11 | బు | చ 1.5 ఉ.షా 28.14 రా 5.21 |
| | 12 | గు | ప 44.26 శ్ర 23.41 రా 0.47 త్యా 3.42 |
| | 13 | శు | ష 37.58 ధ 19.10 రా 3.48 ప్రదోషం |
| | 14 | శ | స 31.57 శత 15.0 ది 30.5 |
| | 15 | ఆ | అ 26.38 పూభా 11.25 రా 2.10 త్యా 3.49 |

Printed and Published by Dr. S. Seshagiri Rao at the Lodhra Press, Kesari Kuteeram Ltd
15, Westcott Road, Royapettah, Madras. Editor : Dr. K. N. Kesari.